# విశ్వ భారతి

( సాంఘిక నవల )




పోణంగి శ్రీరామ అప్పారావు. ఎం. ఏ.,

కేంద్ర ప్రభుత్వ సీనియర్ రీసెర్చిస్కాలర్.

ఉస్మానియా విశ్వవిద్యాలయము, హైదరాబాద్:


హేవిళంబి_సంక్రాంతి


ప్రచురణ:

అరుణశ్రీ గ్రంథమాల

1370–1 జనరల్ బజారు సికింద్రాబాద్.

# కృతజ్ఞతలు

భారతీయసంస్కృతిని చిత్రించవలయుననెడి ఆశయముతో రూపొందిన ఈ నవల లోగడ ఆంధ్ర-మద్రాసు రాష్ట్రములందు స్కూల్ ఫైనల్ పరీక్షకు ఉపవాచకముగా నిర్ణయింపబడి ఆంధ్రావళి మన్నన లందు కొన్నది.

ఈ నవలను క్రొత్తనడకలతో నడిపించి దృశ్యములను కన్నులకు కట్టినట్లుగా రచించిన శ్రీ పోణంగి శ్రీరామ అప్పారావు గారికి, చతుర్థ ముద్రణము యొక్క అవకాశమును మా గ్రంథమాలకు కలిగించిన శ్రీ పోణంగి సత్యనారాయణమూర్తి గారికి కృతజ్ఞతాభివందనములు.

తెలంగాణములో కూడ ఇది వ్యాప్తినంది సహృదయుల ప్రసంశల నంద గలదని విశ్వసించ్చుచున్నాను.

ఇట్లు
*మడిపడిగ బలరామాచార్యులు*
కార్యదర్శి
అరుణశ్రీ గ్రంథమాల,
సికింద్రాబాద్.


ముద్రణ:
ప్రథమ 1950
ద్వితీయ 1951
తృతీయ 1956
చతుర్థ 1958

రు. [illegible] ర

ఓమ్.

# విశ్వభారతి

నాలుగు రోజులు వరుసగా వర్షపు జల్లులు పడినవి. గ్రీష్మము వెనుకఁబట్టినదని యందఱనుకొనినారు. అంతే. ఇఁక మరల చినుకుపడలేదు. కాని యా చినుకులు నాల్గును భూమిలో నణఁగియున్న వేడినంతటిని వెలికిఁ దెచ్చినవి. అంతకుఁ బూర్వ మెండలవలన నొక్క శరీరమే బాధపడినది. ఇప్పు డాత్మ కూడఁ గుతకుత నుడికిపోసాఁగినది.

మరల నేఁ డాకాశమునందు నల్లని మబ్బు పట్టినది. ఎండ యేమో తెరలు తెరలుగా వచ్చుచునే యున్నది. ఇంకను జాలఁ బ్రొద్దున్నను, గొంచెము చల్లఁబడుటచే రజనీకుమారియును గృష్ణరాయలును దోఁటపనిలో నిమగ్నులైనారు. నేఁడు నీరుతోడుట రజనీకుమారి వంతు. నూతి నుండి నీటిబోదెను జాటు చాటుగా రాయలు చాల దూరము ప్రవహింపఁజేసినాఁడు. ఎండ లెక్కువగఁ గాయుటచే నెఱెములు వారిపోయిన నేల కెంతనీరును జాలనది కాదు. అంతలో వసలు నీరు వచ్చుట యాఁగిపోయినది. పరకాయించి చూచినాఁడు.

"రజనీ! నీరుతోడుట మానివేసితివేమి? యిప్పుడే చేతులు నొప్పి వెట్టినవా?" — రాయల హేళనకు జవాబు రాలేదు.

ఇంతలో వగర్చుకొనుచు రజనీకుమారి వచ్చినది. — "అదేమి! ఏమి జరిగినది చెప్పు. నీరుతోడుట మానినావు......" "అవును, నీవు కూనిరాగములు తీయుచుఁగూర్చుండి ఎంతకును నీరు చాలుననవు. నాకుఁజేతులునొప్పి పెట్టినవి. చేతులపట్టుసడలి చేఁద నూతిలోఁ బడిపోయెను. ఆ చప్పుడు విని బెదరిపోయి కృష్ణ పరుగులెత్తుచున్నది. దానిని పట్టుకో రాయలూ..." — "కృష్ణ!... నీ పెంపుడు బిడ్డయా?" రాయలు హాస్య మాడెను. రజని తీక్ష్ణముగఁ జూచినది — "దానిని విడిచి పెట్టుట నీ పనియును, దిరిగి పట్టుకొనుట నాపనియునా? నా వల్ల గాదు." — రజనీకుమారి బతిమాలుకొన్నది. —"రజనీ! ఆ చప్పుడు విని నీవు జడిసికొనలేదుకదా?" రాయలు కొంటెగాఁ బ్రశ్నించెను.—"బాగున్నది. ముందా కృష్ణను బట్టుకొమ్ము. గురుపాదులు జపమును ముగించువేళ యైనది. వేగమే పోవలయును" — "నేను మాత్ర మిక్కడ కాఁపురముందు నను కొంటివా?..."

రాయలు లేడికిఁ గన్పింపకుండ వెళ్ళి, పొంచి దానిని బట్టుకొనినాఁడు. అది నిండు చూలాలు. నేఁడో రేపో యీనును. అది భీతితోఁ బరుగులెత్తుటను జూచి దాని చూలున కేమి యాపద వాటిల్లునో యని రజనీకుమారి హృదయము తల్లడిల్లిపోయెను. రాయలు తన యుత్తరీయ మును గృష్ణమెడకుఁజుట్టి పట్టుకొని రజని యొద్దకు దానిని దీసికొని వచ్చెను. రజని ముఖపద్మ మానందముచే వికసించిన

ల్లయ్యెను. రాయలకుఁ గనులతోనే కృతజ్ఞతను దెల్పుకొన్నది. రాయలేదో చెప్పవలెననుకొనెనుగాని చెప్పలేకపోయినాఁడు.— "...రజనీ ! నతువవేమి ? గురుపాదుల జపమప్పుడే ముగియు నంటివిగదా ?..." — కృష్ణను దీసికొని మెల్లమెల్లన నిరువురును గుటీరప్రాంతములకు వచ్చినారు.

ఆ కూపాశను ప్రదేశము మహానది గోదావరియొడ్డున గోష్పాదక్షేత్ర ప్రాంతములోనున్నది. కుటీరమునకు నొడ్డునకు మధ్యనొక గొప్పవటవృక్షముస్నది. అది చాలఁ బురాతనమైనది. విశ్వనాథుఁ డావృక్షమూలమునఁ గృష్ణాజినముపైఁ గూర్చుండి జప మొనరించుచుండును. యోగాభ్యాసములో నున్నంత కాలము తల్లిప్రమానిలో సహజముగ నేర్పడిన తొఱ్ఱలో నుపవిష్టుఁ డగును. ఆచెట్టు క్రింద మండువేసవిలోఁ గూడ మిక్కిలి చల్లగా నుండును. ఆ కూపాశమ ప్రదేశమంతయు విజయేశ్వర సంస్థానములోనిది. విశ్వనాథుని పూర్వులందఱు విజయేశ్వరాధీశులకుఁ బురోహితులు. వారందఱును వేద వేదాంగ పారంగతులు. సనాతనధర్మమునకుఁ బట్టుగొమ్మలు. జమీందారులు వారికి మహోన్నతమైన గౌరవమొసంగుచు వచ్చిరి. వీరును దమ జీవితముల నా జమీందారులకు హిత మాచరించుటలోనే గడపివేసిరి.

తల్లిదండ్రులకు వృద్ధాప్యమునందు విశ్వనాథుఁడు జన్మించెను. వానికైదేండ్లువచ్చునప్పటికి "విశ్వనాథుఁడు భద్ర" మని పెద్దకుమారునితోఁ జెప్పి తండ్రి మరణించెను. తల్లియుఁ

దండ్రి ననుసరించెను. అందువలన నన్నయు, వదినయు విశ్వ నాథునికిఁ గడుగారాబముచేసిరి. ఆ గారాబము వానిని బెంకి వానినిగ నొనర్చినది. పదేండ్లు వచ్చినను వానికిఁ జదువు సంధ్యలు పట్టలేదు. పురోహితుని తమ్ముఁడు కాన తన సమ వయస్కుఁడగు రాజకుమారునితోఁ బరిచయము సంపాదించి వానితో నాటపాటలు మొదలువెట్టెను. విశ్వనాథుని కంఠము వినసొంపుగానుండును. ఆకంఠమన్నచో రాజకుమారుఁడు చెవి కోసికొనును. ఒకనాఁటిసాయంసమయమం దిరువురును మామిడి తోఁటలో నాడుకొనుట మొదలుపెట్టిరి. అట నొక చెట్టుక్రింద నొకేయొక బండరాయి యున్నది. రాజకుమారుఁడు దానిపైఁ గూర్చుండఁ బోవ వానిని ప్రక్కకుఁ ద్రోసి తన పెంకెతన మంతయు మొగమున నుట్టిపడ విశ్వనాథుఁడు తానే యందుఁ గూర్చుండెను. రాజకుమారునకుఁ బట్టరాని కోపమువచ్చినది.

రాజకుమారుఁడు — "నన్ను ద్రోసివేయుటకు నీవెవ్వఁ డవు? ముందు రాయిదిగి మఱి మాట్లాడు." విశ్వనాథుఁడు భ్రుకుటి ముడివైచెను. "నన్నడ్డగుటకు నీవెవ్వఁడవు?" — రాజకుమారుఁడు—"నేను జమీందారుల బిడ్డఁడను. నీకుఁ బ్రభు వను." విశ్వనాథుఁడు—"వెఱ్ఱి! నేను విశ్వనాథుఁడను. తెలిసి నదా? ప్రపంచమున కంతటికిని బ్రభువు నన్నమాట. నీవా నాకుఁ బ్రభుఁడవు?" — వాహ్యాళికై యయలుదేరిన జమీందా రును, బురోహితుఁడును నా సమయమునకే యచ్చటికిఁ జేరి ఒక మ్రానిప్రక్క నొదిగి నిల్చిరి. విశ్వనాథుని జవాబు

రాజకుమారునికిఁ దల కొట్టినట్లయినది. రాజకుమారుఁడు—"నీకుఁ గన్నులు గనఁబడుటలేదు. పొగరెక్కి మాట్లాడుచున్నావు. క్రొవ్వెణఁగఁ గలదు."

విశ్వనాథుఁడు అిప్పుడనలేచి చేతికొలఁది రాజకుమారుని చెంపపైఁ గొట్టెను. రాజకుమారుని సుతిమెత్తని మొగము కందగడ్డవలె నైనది. పురోహితుఁడు నిశ్చేష్టితుఁ డయ్యెను. వానియొడలు వణఁకినది. జమీందారుగారి మొగమున నేలొకో మందహాస రేఖలు దోఁచినవి. రాజకుమారుఁడు కొంతవడికిఁ గ్రుక్కు త్రిప్పుకొని పండ్లు పటపట నూరసాఁగెను. విశ్వనాథుఁడు — "మిత్రమా! క్రొవ్వు ఎవరి కణఁగినది? ఇఁక నెప్పుడు నట్టిప్రేలుడు రానీకుసుమా!" — రాజకుమారునికిఁ గోపాతిరేకమున మాటరాలేదు. ప్రక్కనే పడియున్న యెండు మామిడిపుల్లను దీసి దానితో విశ్వనాథుని గొట్టఁబోవునంతటిలో "నాన్నా! తప్పు. తప్పు." అనుచు జమీందారుగారు వేగముగవచ్చి కుమారుని చేతిలోని కట్టె నావలఁ బాఱవేసిరి. ఆయనవెంటఁ బురోహితుఁడును వచ్చెను. వారినిగాంచి బాలురిరువురును దెల్లఁబోయిరి. విశ్వనాథుఁడు సిగ్గునఁ దలవాల్చెను. రాజకుమారునకు దుఃఖ ముప్పొంగినది. జమీందారుగారి మొగమున శాంతము తొణికిసలాడినది.

"నాయనా! నీ కింత కోప మేలొకోయి?" అని జమీందారుగారు కుమారుని లాలించిరి. తనతండ్రి విశ్వనాథుని శిక్షించుటకుమాఱుగఁ దనకుఁ గోపముకూడ వలదనుచుండెనే!

రాజకుమారుని కిది చిత్రమయ్యెను. దీన వానికోపము సగము తగ్గిపోయినది. జమీందారుగారు విశ్వనాథుని, వాని యన్నగారిని జూచి, "నాయనా! వీరు మనవంశమునకు బ్రహ్మలు. ఎంత కోపము వచ్చినను మనము వీరినేమియు ననరాదు. తరతరములనుండియు మనకు వచ్చిన మూలధనము శాంతము. నీవందులకు వ్యతిరేకివి కారాదు..." అని బోధించినారు. ఆ పలుకుల యర్థము విస్పష్టము కాలేదు గాని వారినేమియు ననఁగూడదు కాఁబోలునని వాని పసియెడంద యూరట చెందినది. వాని కోపము పూర్తిగాఁ దగ్గిపోయెను. విశ్వనాథుఁడు తలయెత్తి చూచినాఁడు. జమీందారుగారి మోమున దివ్యతేజ మేదియో వాని కనులకు విభ్రమము గలిగించెను. రాజకుమారుని మొగమునఁ గ్రొత్తగా వచ్చినవినయము తోఁచినది. ఆ జమీందారుల సంస్కారపటుత్వమునకుఁ దన యన్నగారి కనులు జోహారులు చేయుచున్నవి. రాజకుమారుఁ డెట్టి యర్థముతో ననినను, బ్రభుపను పదమున కర్థమేమో విశ్వనాథుని కొంకింత యిప్పు డవగాహనమైనది. ఇఁక నాతఁ డట నిలువలేదు. చరచర నడచి వెళ్ళిపోయినాఁడు.

విశ్వనాథుఁడింటికి వచ్చి వెక్కి వెక్కి యేడ్చుచుఁ బరుండెను. ఏదియో జరిగినదని వదినెగారు భయపడినది. ఆమె వచ్చి లాలించి యన్నముతినిపించెను. భోజనానంతర మన్నగారు పిల్చి, "తమ్మా! నీవు పెద్దవాఁడ వగుచున్నావు. చదువు కొనవలయును. మన పూర్వు లందఱును విజ్ఞానసంపన్నులు.

అది మనధర్మము. నీవు వంశమునకుఁ బేరు తెత్తువని మనతండ్రి గా రాశించినారు. నీవిట్లల్లరి చిల్లరగాఁ దిరుగుట బాగుండ లేదు......" అని బోధించినారు. తన్నేమి కోపించునోయని కంపించుచున్న విశ్వనాథుని కిది యాశ్చర్యమైనది. తనయన్న గారు శాంతముతో జమీందారుగారిని మించినారే! తమ్ముఁ డన్నగారి బోధనలకుఁ దలయూపి వచ్చి పరుండి యాలోచింప సాఁగినాఁడు.

"నాకుఁ బదేండ్లు వచ్చినవి. అక్షరములు వ్రాయుటే రాదు; అన్నయు దినము సిచ్చిన చనవుతో నూహావచ్చి నప్పటినుండియు నేనల్లరి చిల్లరిగా నే తిరుగుచున్నాను. నా తోడివా రందఱును జాలవఱకుఁ జదువుకొనినా రప్పుడే. మఱి నేను?......వంశమునకుఁ బేరు తెత్తునని మా తండ్రి గా రాశించినారఁట. కుమారుఁ డెప్పుడు నుండక కట్టివిశ్వాసముండును గాఁబోలు......అన్నను, నన్నును గుమారునకుఁ జూపి 'వీరు మనవంశమునకు బ్రహ్మ' అని జమీందారుగారు చెప్పి నారు. రాజకుమారుఁడును నన్నేమియు ననఁగూడదఁట! దాని యర్థమేమి?......ఆ జమీందారుగారి మొగము అట్టి దివ్య తేజస్సుతో వెలుఁగుచున్నది. శాంతము వారికిఁ దరతర ములనుండి వచ్చుచున్న మూలధనమఁట. ఈ రెండు వంశము లును రెండు మహాధర్మములకు మూలపీఠములై యున్నవి. ఆ రెండు గుణములను నా యందు నే నేల యైక్యపఱచరాదు?..."

విశ్వనాథుఁడు దీర్ఘ యోచనలో మునిఁగినాఁడు. అప్రయత్నముగ వానిదృష్టి కాశిపై మఱలినది. తనముత్తాతగారు కాశిలోనే చదువుకొనినారని యాతఁడు వినియుండెను. అది గొప్ప విద్యాకేంద్రమనికూడ నాతఁ డెఱుంగును. అందుచే నచ్చటనే తాను విద్యనభ్యసించుటకు నిశ్చయించుకొనెను. వాని నిర్ణయము దృఢమైనదని యెఱింగి తమ్ముని విడిచి యుండుట కష్టమయ్యును మనసార దీవించి యన్నగారు సెలవొసంగిరి. వదినెగారును వానిశిరమును మూర్కొని 'నాయనా! మీతల్లిగారి యాత్మకు నమస్కరించి మఱీవెళ్ళు" మని చెప్పెను. విశ్వనాథుఁ డట్లే చేసెను

## 2

పదాఱు సంవత్సరముల కావిశ్వనాథుఁడు తిరిగి యింటికి వచ్చినాఁడు — నాఁటి విశ్వనాథుఁడు వట్టిపోకిరి ; అక్షరజ్ఞానము లేనివాఁడు. నేఁటి విశ్వనాథుఁడు వినయభూషణుఁడు ; వేద వేదాంగ పారంగతుఁడు ; లలిత కళావేత్త — నాఁటి విశ్వనాథుఁడు సంగీతజ్ఞానము లేక కూనిరాగములుతీయు బాలుఁడు. నేఁటివిశ్వనాథుఁడు సంగీతశాస్త్రమునుకూలంకషముగ నెఱింగిన మహావిద్వాంసుఁడు — నాఁటివిశ్వనాథుఁడు మున్కోపి. అతని యంత ధూర్తుఁ డాతఁడే ; నేఁటి విశ్వనాథుఁ డహింసామూర్తి. భూతదయాళువు. శాంతము కరుడుగట్టిన జితేంద్రియుఁడు—ఈ స్థితిలో విశ్వనాథుఁడింటికి దిరిగివచ్చెను.

విశ్వనాథుఁ డూరలేని కాలమున విజయేశ్వరమునందుఁ బెక్కు మార్పులు జరిగినవి. విశ్వనాథుని యన్నగారు వృద్ధు లైనారు. వారి పుత్రులు పెద్దవారై సంసారమును దిద్దుకొను చున్నారు. విశ్వనాథునిమార్పునకుఁ గారణభూతులైన పెద్ద జమీంగారుగారు చనిపోయిరి. ఇప్పుడు జమీందారు విశ్వ నాథుని బాల్యస్నేహితులగు కుమారమోహనులు. దాతృత్వ ములో, కళాభిజ్ఞతలో, రాజనీతివేతృత్వములో నాయనతండ్రికిఁ దగిన కొడుకని పొగడ్త కెక్కినారు — పెద్దజమీందారుగారు మరణించిరని విజయేశ్వరమునం దడుగిడుటతోడనే విని విశ్వ నాథుఁడు చాల బాధపడెను. దివాణములోని వృద్ధసేవకులు విశ్వనాథుని గుర్తించి జమీందారుగారితోఁ జెప్పనేఁగిరి.

అనుకోకుండఁగనే తమ్ముఁడు కంటఁబడుటచే నన్నగారి యానందమున కవధి లేకపోయినది. ఆనందబాష్పములతోఁ దమ్మునిశిరము నభిషేకించినారు—"తమ్మా! నేఁడుగదా మన ధర్మము నిల్చినది. నేఁడుగదా మన నాయనగారి యాశలు ఫలించినవి. నేఁడుగదా నాకు విశ్వనాథుఁడు నాతమ్ముఁడన్న గర్వము కల్గినది." అని యన్నగారు రుప్పొంగిపోయిరి. వది నెయు మఱందిని మాతృవాత్సల్యముతో నాదరించెను. ఆప్యా యముగ భుజించుచు "వదినా! ఎంతకాలమునకు దొరికిన దమ్మా నీచేతి భోజనము"ని విశ్వనాథుఁ డానందపడినాఁడు.

సాయంకాలమున జమీందారుగారు కబురంపించిరి. వెళ్ళునప్పటికి మామిడితోఁటలో నున్నారని తెలిసినది. అటఁ

దము చిన్ననాటి తనవునకుఁగారణమైన బండజాతిపై రామ మోహనులు కూర్చుండియుండిరి. అన్నగారితోఁగూడ వచ్చు చున్న విశ్వనాథుని తేజోమయమగుమూర్తి వారి కాశ్చర్యము కల్గించెను. ఆయన ముందునకు సాఁగి విశ్వనాథుని కప్రయత్న ముగా నమస్కరించెను. విశ్వనాథుఁడు వారిచేతులను బట్టుకొని నిల్చినాఁడు. ఉతునిముసముల్లో నాబాల్యమిత్రు లిరువురును గాటమగు కౌఁగిలిలో, నానందబాష్పములతోఁ దన్మయులై నిల్చిరి. వారిసంపురణనుజూచి విశ్వనాథునియన్నగా రానంద పర వశులైనారు — జీవితములో నేదేని యొక మహాకార్యమును నిర్వహింపవలెనని విశ్వనాథుని యభిలాష. వారణాసిలో వాని గురునాజ్ఞయునంతే. అనుకూలనమయ మేతెంచువఱకు యోగా భ్యానములోఁ గాలముగడుపవలెనని వానియూహ. ఈవిషయ మెఱింగిన కుమారమోహనులు గోపూరు గ్రామపు (ఇప్పటి వ్యావహారిక నామము'కొవ్వూరు') పరిసరమున నొక యాశ్రమ ప్రదేశమును విశ్వనాథు నుపయోగార్థ మిచ్చివేసిరి.

ఆ కుటీరప్రదేశము మొత్తము నూఱెకరములవైశా ల్యము కలది. దీర్ఘచతురస్రాకారముగా నది పొడవునను జాల వఱకు వ్యాపించియున్నది. అందు సమస్త ఫలవృక్షములు, లతలు, పొదలు నున్నవి. విశ్వనాథుఁడు ప్రకృతి సౌందర్య ములకే ప్రాధాన్యమిచ్చువాఁడగుటచే వాని కేమియును కృత్రిమపోషణ జరుగలేదు. సహజములగు ప్రకృతిరామణీయక ములను బరికించి చూచి విశ్వనాథుఁడొకొక్కప్పుడు తన్మయుఁ

డై పోవుచుండును. సంధ్యాకాలములందు గోదావరియొడ్డు మీఁద నిలుచుండి చుట్టుపట్టులను బరిశీలించునపుడు వాని శోభ యింతింతని చెప్పనలవి కాదు.

దూరాన ఏకనీలముగానున్న పాపికొండల వరుసలు; వాని నొరసికొనుచు మధ్యగా ప్రవహించుమహానది గోదావరి; అస్తమించుచున్న సూర్యబింబము; గోష్పాదక్షేత్రస్థ శివాలయ శిఖరపు పసిఁడి కాంతులు; పక్షులతోఁ గలకలలాడుచున్న వటవృక్షము; కుటీరము వెనుకనున్న యుద్యానవనము నందలి ప్రకృతిరామణీయకములు; ఆ ప్రక్కగా నొకింతదూరమున జనసమ్మర్దమైన గోవూరు......ఒకటేయననేల? ప్రతి పరమాణువునందు నున్న సృష్టిసౌందర్యములను దిలకించి సృష్ట్యనంతరము తన సృష్టినిగాంచి తానే వెఱఁగుపడు విశ్వనాథునివోలె విశ్వనాథుఁడు సంభ్రమించుచుండెడివాఁడు. ఆంధ్రుఁడనై జన్మించుటేకాక యతిపవిత్రమగు గోష్పాదక్షేత్రమున నివసింపననువుపడినందునఁ దనజీవితమే యుత్కృష్టమైనదని వానికిఁ గించిద్గర్వముకూడఁ బొడముచుండెడిది. దూరమునుండి చూచినచో, ఆ యాశ్రమప్రదేశము చిన్న కాఱడవివలెఁ గన్పించును. అయినను ఆశ్రమమునఁగాని, యా చుట్టుప్రక్కలఁగాని విషోరగవ్యాఘ్రతస్కరాదుల వలని భయ మావంతయునులేదు. అహింసామూర్తియగు విశ్వనాథుఁ డున్నచోట హింసకును, క్రూరతకును దావెక్కడిది?

అట్లు లేడిని దీసికొని రజనీకుమారియును, కృష్ణరాయలును గుటీరప్రాంతములకు మెలమెల్లన వచ్చిరి.

"రజనీ! నేఁడు శ్రావణపూర్ణిమ కాదా? గురుపాదుల జపమిప్పుడే ముగియు వేళయైనదంటివేమి?" అని రాయలు ప్రశ్నించెను. రజని మందహాస మొనర్చినది. "అట్లననిచో నీవాక పట్టున లేడిని పట్టుకొని యుందువా!"—రాయలు లేడి మెడకుఁ జుట్టినతనయుత్తరీయమును దీసివేసెను. కృష్ణసారము క్రిందికిఁ బోయినది. అది దానికి విశ్రాంతిస్థలము. ఆస్థలమును విడిచి వారిరువురును నడచుట మొదలుపెట్టిరి. ఎక్కడికో? . . . వారికే తెలియదు. హృదయము లాజ్ఞాపించుచున్నవి. పాదములు నడచుచున్నవి. కాని తామిరువురు నిట్లు కలిసి నడచుచుండుట వారికే చాలఁ గ్రొత్తగా నుండెను.

"రజనీ! ఇఁకఁ బదిరోజులలో మనవిద్యాభ్యాసము పూర్తియగును..." అని రాయలన్నాఁడు. రజని యతని మొగము వైపు చూచినది. "అవును. దశమినాఁడు మానాయనగారువచ్చి గురుపాదులనుండి సెలవు గైకొందురఁట." — ఇరువురు వడిగా నడచుచుండిరి. రాయలు మరల పల్కరించెను. "రజనీ! మనము పండ్రెండు సంవత్సరములు కలిసి చదువుకొన్నాము..."— "కాదు. ఆఱు సంవత్సరములే కలిసి చదువుకొన్నాము..." అని రజని యన్నది—"ఎట్లు? మనము తారణసంవత్సరములో నిట ప్రవేశించితిమి. ఇది మన్మథ సంవత్సరము." — మన్మథ సంవత్సర మనఁగనే రజని పెదవులపైఁ జిరునగవు చిందులాడి

నది. అందులో నీషల్లజ్జాంకురము కూడ నున్నది. దానిని రాయలు కనిపెట్టకపోలేదు—"రజనీ! తారణ మొదలు మన్మథ వటుకును బండ్రెండుసంవత్సరములు కాలేదా?" - "ఈపండ్రెండు సంవత్సరములలోను ఒక్క పగటిపూటలందు మాత్రమే మన మిచ్చట కలిసి చదువుకొంటిమి. రాత్రులందిచ్చట లేము కదా?" ఈసమాధానమునకు రాయలు త్సాహముతో నవ్వెను.

ఇరువురును బొగడచెట్టుక్రిందికిఁ జేరినారు. ఇరువురటఁ జెతియొక శిలపై నాసీనులైరి. ఏమి మాట్లాడుకొనవలయునో వారూహించుకొనలేదు, తెలియుటలేదు. ఏదియో మాట్లాడు కోవలయునని హృదయములు తొట్రుపడుచున్నవి. మొట్ట మొదట వెలిఁబుచ్చుట కెవ్వరికిని ధైర్యముచాలుటలేదు. వారి హృదయవేగముల కన్నను వేగముగాఁ బ్రొద్దు క్రుంకనున్నది. ఇంతలో వారివెనుక నాకసమున నల్లనిమబ్బు దట్టముగఁ బట్టినది. ఏమో మధురములైన యాసలు రేకెత్తి యిరువురొకరి వైపొకరు చూచుకొనిరి. అంతలో వాయువ్యమూలగా నొక్క గాలివిసురు వచ్చి వృక్షములను గదలించి పోయెను. ఆగాలి చల్లగా నుండుటచే రజని తనశరీరమును ముడుచుకొన్నది. రాయ లుత్తరీయమును గప్పుకొనెను. వర్షము వచ్చునన్న విషయమును వారు గుర్తించి నట్లు లేదు.

పిల్ల వాయువులవలన రాలుచున్న పొగడపూలతో వారిరువురి శిరములు నిండినవి. కమ్మని పూలతావి పిల్ల వాయు వులతో మిళితమై నల్దిక్కుల వ్యాపించెను. పెంపుడు నెమ్మి

మొటనుండి వచ్చెనో కాని పురివిచ్చి వారికెదురుగ నాట్యము చేయసాగెను. ఇంతలో నొక వర్షపుజల్లువచ్చినది. వారి శరీరములు చల్లఁబడినవి. మరల నిరువురిచూపులును గలిసికొన్నవి. అంతఁ దమలో నేమేమో సిగ్గుపడి తలలు వంచుకొనినారు.

అడుగులఁ దడఁబడ నిరువురును వేగముగ నడువఁ జొచ్చిరి. వారినివెనుకనుండి వర్షముతఱుముకొనివచ్చెను. వారు పరుగిడలేకపోయిరి. కుటీరమును జేరుసరికి నిరువురునుబూర్తిగా దడిసిపోయినారు. వటవృక్షమూలమునఁ దొఱ్ఱలో యోగసమాధిలో నున్న తమయాచార్యునిజూచి కుటీరప్రాంగణములో నిల్చినారు. రాయలు నుదుటపై నున్న వాననీటిని దుడుచుకొనినాఁడు. రజని పావడకుచ్చెళ్ళను బిండుకొన్నది. వెలుపల వర్షవేగమును గ్రమముగా మందగించినది. ఇరువురును బొడివస్త్రములను గట్టుకొని, ఎవరివస్త్రములను వారే యారఁగట్టి వానిచాటునఁ గూర్చుండిరి. విశ్వనాథుఁడు మఱునాఁటి యుదయమునకుఁగాని యోగసమాధినుండి యీవల కేరాఁడు. ఆ రాత్రియంతయు వారిరువురును మాట మంతిలేక గడపవలెను. మధురభావనలతో వారల్లే యొడ్డిగిలిరి.

## 3

అది మహైశ్వర్యముతోఁ దులఁదూఁగు గ్రామరాజము. పంటలు సమస్తమును సమృద్ధిగా నచ్చటఁ బండును. లేమిచే వెతలఁబడు నొక్కపౌరుఁడైన నందుఁగన్పడఁడు. పంటసౌఖ్య

ముతోఁ బాటు కుటుంబ సౌఖ్యము ననుభవించుచుఁ బ్రజలు మహానందమునఁ గాలము గడపుచుందురు. అచ్చటివారెల్ల స్వధర్మనిరతులై తమవృత్తుల నేమఱక నియమముతో నెఱవేర్చుచుందురు. అచ్చటిగోసమృద్ధి మెండు. ఆగ్రామసౌభాగ్యమునకు మూలమైన కారణములలో ముఖ్యముగ గోసంతతిని బేర్కొన వలసి యున్నది. ఆగ్రామవాసు లాబాలగోపాలము గోసేవలోఁ దమ్ముఁ దామే మఱచిపోదురు.

రాత్రి నాల్గవజామున లేచి రైతులు దూడల నావుల యొద్దకు విడిచిపెట్టుదురు. ఆ సమయమునఁ బ్రతిగోశాల నుండియుఁ బాలు పిదుకుచున్న ధ్వనులు కర్ణపేయముగా విన వచ్చుచుండును. అంతటఁ బాలేరు లరుదెంచి గోశాలలను శుభ్ర పఱతురు. ముదుసలులు లేచి స్వయముగా గోవులకుఁ గుడితి కలిపి పెట్టుదురు. సూర్యోదయకాలమునఁ గడుపునిండుగాఁ బాలుత్రావిన లేఁగదూడలు వేయు చిలిపిగంతులకుఁ దన్మయత్వమును జెంది కుడితి త్రాగుటమాని నిలిచి పరికించు నావులనుగాంచి యాముదుసలులు పొందుసంతోషము వర్ణనాతీతము. ప్రొద్దెక్కకుండఁగనే పాలికాఁపుల పిల్లలువచ్చి దూడలను గడ్డివాములందు విడిచి యావులను బచ్చికబీడులలోనికిఁ దోలుకొని పోదురు.

గ్రామమునకు మూఁడువైపులను విశాలమైన భూములు గోవులు మేయు పచ్చికబీడులకై ప్రత్యేకింపఁబడినవి (నాల్గవ వైపున గోదావరినది యున్నది.) వానినే గోభూములందురు.

సాయంకాలమున సూర్యాస్తమయ మగుచుండగాఁ బశుతతి యిండ్లకుమరలును. అప్పుడు పశుశాలలం దానంద లక్ష్మియే తాండవించుచుండును. పశువులింటికి మరలువప్పుడు మందలవెనుక పెద్దకొండలనుబోలి దుమ్ము రేగుచుండును. ఆసమయమును గోధూళిలగ్నమందురు. గోధూళీలగ్నములందుఁ బ్రయాణముచేసిన-చో మంచిఫలితములొనగూడుననియాగ్రామవాసులనమ్మిక. వారెల్లప్పుడునాసమయములందేవయనింతురు.

ఎంతపాఁడియున్నను ఆ గ్రామవాసులు పాలు పెరుఁగుల నమ్ముకొనుట నెఱుంగరు. తమకెక్కువగానున్నది పాలేరులకు, నిఱుపేదరైతులకు నొసంగుచుందురు. ఆ గ్రామమున రోగపీడితులు మచ్చుకైనఁ గన్పడరు. జారచోరాదిభయము లాగ్రామ మెఱుంగదు. కారణము లేమిలేకపోవుట, నిత్యసంతృప్తి, అధర్మ భయము—ఆగ్రామము పేరు కుమారదేవము. ఆగ్రామమేర్పడిన మొదటిరోజులలోఁగుమారస్వామిదైవముగఁ గొల్వఁబడెనఁట. అందుచే దానికిఁ గుమారదేవమని పేరు వచ్చెను.

యూరిలోనున్న స్థితిమంతుల కుటుంబములలో రామయ్య గారిదొకటి. రామయ్యగారి తండ్రి కృష్ణయ్యగారు. కృష్ణయ్య గారుతమచిన్ని రామయ్యను జదివింపవలయుననియుత్సహించెడి వారు. కాని, రామయ్యగారిచూపు ఎప్పుడును నాఁగేటిచాలు పైనేయుండెడిదఁట. మొత్తమున కాయునకును జదువునకును సరిపడినది కాదు. అంతలోఁదండ్రిగారు చనిపోయినారు. ఇంకఁ జదువునకు స్వస్తిచెప్పి ఆయన వ్యవసాయములోనికిదిగిరి. అప్ప

టికి రామయ్యగారికిఁబదేండ్లుదాఁటినవి. ఆదేమిహా స్తవిశేషమో కాని రామయ్యగారుపట్టిన దెల్లబంగారమైనది. అడుగకుండఁగనే యిచ్చు మహోదాత్రివలె భూదేవి తేగ పండినది. కుమారదేవము నకు దక్షిణముగను, జడములను రామయ్యగారికి నూటయేఁబది యెకరముల కొండ్రడయున్నది. అదియంతయును మెరకపంటయే. అందులో రామయ్యగారు వేసిన ధాన్యము పండినది వారంచనా వేసినదానికిమించి యెక్కువ పంట యింటికి వచ్చినది.

పదునైదవయేట రామయ్యగారికి వివాహమైనది. ఆయనకుఁబాతికయేండ్లు వచ్చునప్పటికి భార్య ఈశ్వరమ్మగారు కాఁపురమునకు వచ్చిరి. రామయ్యగారి హస్తమును మించిన దీశ్వరమ్మగారి పాదము. ఆమె కాఁపురమునకువచ్చిన సంవత్సరము రామయ్యగారు చాలభూమిని కొన్నారు. కమతము రెట్టింపు చేయఁబడినది. ఈ యభివృద్ధితో నూరిలో రామయ్యగారి మాటకుఁ బలుకుఁబడి హెచ్చినది - ఈశ్వరమ్మగారును రామయ్యగారును బ్రాణమొకజీవులు. ఈశ్వరమ్మగారి విధేయతయు, రామయ్యగారి యనురాగమును వానికవియే సాటి. ఆ పవిత్రజీవిత ప్రథమఫలము కృష్ణరాయలు. రామయ్యగారు మహావైభవముగా బుత్రోత్సవ మొనరించిరి. కృష్ణరాయలు పుట్టిననాఁడు తమ చిన్నయింటిని మార్చి గొప్ప సౌధమును గట్టవలెనను నూహ రామయ్యగారికిఁ బుట్టినది. తలంచుకొను టయే తడవుగ సౌధనిర్మాణమునకుఁ బూనుకొనినారు. ఆ సౌధము పూర్తియగుటకు రెండేండ్లు పట్టెను. మహారాజ

సౌధములను మించుచు గొప్పశిల్పపుం బనులచే నది యలరారు చుండెను. సౌధమునకు దక్షిణ దిక్కునను బడమటి దిక్కునను నందనోద్యానమునుమించు నుద్యానవనమును వేయించిరి. కృష్ణ రాయల రెండవ జన్మదినోత్సవమునాఁటి కీయుద్యానవనము బాగుగాఁ బెరిగినది. నాఁడే గృహప్రవేశమును జరిగెను.

ఆ యుద్యానవనమునకు దక్షిణాంతమందు గంధపు దోఁపు వేయించఁబడెను. దానిని వృద్ధిపఱచుటకై రామయ్య గారు చాల శ్రమపడినారు. శ్రమకు ఫలితము దక్కి గంధపుఁ దోఁపు బాగుగా నాటినది. ఆ సౌధమునకు ముందొక పెద్ద పందిరిపై మాధవీ లతలు నాల్గుమూలలను ప్రాకింపఁబడినవి. వర్షాకాలమునఁ దెల్లవారునరికి మాధవీ పుష్పములు పందిరి క్రింద పట్టుపఱపులు పఱచిన ట్లొత్తుగ రాలుచుండును. ఆ పూవులచే నాసౌధమేకాక చుట్టుపట్లు లన్నియు ఘుమఘుమ లాడి పోవుచుండును. అందుచే నా సౌధమునకు 'మాధవీ మందిర' మను పేరు వచ్చెను.

కృష్ణరాయలకు మూఁడవయేఁడు వచ్చెను. ఈశ్వరమ్మ గారు ద్వితీయగర్భమును దాల్చిరి. రామయ్యగారామెకు మహారాణికిఁబోలె నుపచారములు చేయించిరి. ప్రసవదినము లేతెంచినవి. విశ్వనాథుఁ డొక సాయంసమయమున గోదా వరి యొడ్డుననే నడక మొదలుపెట్టి అనుకోకుండఁగనే కుమార దేవము వఱకునువచ్చినాఁడు. విశ్వనాథుని ప్రశస్తినాఁటి కన్ని దిశలందును వ్యాపించినది. అందువలన రామయ్యగారివంటి

పెద్దలందఱును విశ్వనాథు నెఱుంగుదురు. ఆతఁ డట్లు కాలినడకను వచ్చుచుండుట విని రామయ్యగారు కొమ రేఁగి తన్నెఱింగించుకొని యతని మాధవీ మందిరమునకుఁ దీసికొని వచ్చినారు. వారిరువురకు రాయ లెదురువచ్చెను. రామయ్యగారు వాని యొడలు నిమురుచు "నాన్నా ! ఇటుచూడు" మ్మని విశ్వనాథునిఁ జూపించిరి. రాయలు నమ్రతతో రెండుచేతులను మెల్లగ జోడించి నమస్కరించినాఁడు. విశ్వనాథునికి రాయల వైఖరి మహానంద మయ్యెను. ఒకక్షణ మాబాలు నాతఁడు తేఱిపాఱఁ జూచినాఁడు. ఎంతకాలమునుండియో తాను సంకల్పించుకొని యున్న యొక మహాకార్య మా నిముసమందే నెఱవేఱిన ట్లాతని హృదయము తేలికపడినది. "బాబూ" అనుచు విశ్వనాథుఁడు రాయలను జేతులలోనికిఁ దీసికొనినాఁడు. విశ్వనాథుని మోములో వ్యక్తమైన యా భావమును రామయ్యగారు గమనింపకపోలేదు. తరువాత వారిరువురును బొలము వైపునకు బయలు దేరిరి. రామయ్యగారి గోశ్రీని జూచి విశ్వనాథుఁడు ప్రశంసించినాఁడు. తిరుగ మొగముపట్టి వారొక్కచో నించుక విశ్రమించుటకై కూర్చుండిరి.

గాలి విసురులు మందముగా నుండియుండి యొక్కమాఱు చెల రేఁగినవి. అప్పుడు ఘుమఘుమ లాడుచు నొక మధురమైనవాసన వారినాసికాపుటములయందుఁ జొచ్చి విశ్వనాథుని విస్మయుని గావించెను. నిముసనిముసమునకు నా సువాసన మారిపోవుచున్నది. మొదట సంపంగిపూవు వాసన

కొఱ్ఱెను. ఒకింతలో జామపండు మిగుల ముగ్గిన వాసన వచ్చెను. మరల రెండురోజులు నిలువయున్న వెలగపండు వాసన వచ్చినది. విశ్వనాథుఁ డాశ్చర్య మానసుఁ డయ్యెను. ఒక వల్మీకమునుండి యీ వాసనలు వచ్చుచుండునని రామయ్యగారు చూపించిరి. విశ్వనాథుఁ డచటికిఁ బోయి దాని బరీక్షించి మిక్కుటమగు సంతసమున వెనుకనే యున్న రామయ్యగారితో నిట్లు చెప్పెను – “సుమారు మూఁడు నిలువుల లోఁతున నిందొక తెల్లత్రాఁచున్నది. దాని శరీరమే యిట్టి సువాసనలను జిందుచున్నది. అటనే యొక గొప్ప నీటిజల కూడ నున్నది. ఆనీటితో వేయి యెకరముల భూమిని సాగు చేయవచ్చును......”

రామయ్యగారి యాశ్చర్యమున కవధి లేకపోయినది. ఏమీ యీయదృష్టలక్ష్మీకటాక్షము! ...... సిరియయాచితప్రాప్తమగుట సామాన్యవిషయము కాదు. సజ్జనసాంగత్యఫలితమిది. రెండురోజులైనను దన యాతిథ్యమును స్వీకరింపవలయునని రామయ్యగారు విశ్వనాథుని బ్రార్థించినారు. ఆ మఱునాఁడు రామయ్యగారు పనివాండ్రను బిలిపించి పుట్టను ద్రవ్వించిరి. అంత మహాకోపమునఁ ద్రాఁచు పైకి వచ్చినది. దాని కఱువదియేండ్లు దాఁటియుండును. లేనిచోఁ దెల్లత్రాఁచునకా సువాసనలు వయసులో నుండవు. అంతఁ గోపముతో నది పైకి వచ్చినను శాంతమూర్తియగు విశ్వనాథుఁ డెదురుపడఁగనే యంత త్రాఁచును ద్రాడువలె నైపోయినది. రామయ్యగారు

దానికి నమస్కరించి "స్వామీ ! ఈ ప్రదేశమును విడిచిపెట్టి నీ చిత్తము వచ్చినచోట నివసింపుము." అని వేడెను. అది చరచర ప్రాకిపోయి యుద్యానవనమునందున్న గంధపు చోపులో నివసింపసాగెను. కాని యీవిషయము నెవ్వరును గమనింపలేదు.

అత్రాచు నివసించుచోట నొక యెత్తైన నమ్మకలదు. ఆ స్థలము మంచిగంధపు వాసనలను విరజిమ్ముచు శరీరము కొంకెలుపోవునంత చల్లగానున్నది. గొప్పజాతిసర్పములన్నియు నట్టి స్థలములందే నివసించునని ప్రతీతి. అచటిగడ్డను కొలదిగఁ బెల్లగించినంతనే మహావేగముననీటిధారపైకిఁజిమ్మెను. ఏనుఁగు తొండములావున నీటిధార మూడునిలువుల పైవఱకుఁ బోయి నేలపైఁ బడుచుండెను. చూచుచుండఁగనే యాప్రదేశ మంతయును గొల్లేరయిపోయెను. ఇంతలో నీశ్వరమ్మగారు సుఖముగా మగశిశువును బ్రసరించిరనువార్త వచ్చెను. ఆనీటి ధార పైకివచ్చుటయు నచట శిశుజననమును సరిగ నొకే క్షణ మందు జరిగినవి — "నీవు మాపాలిటి భాగ్యదేవతవు. నీకు సర్వదా మేము కృతజ్ఞులము. ఏమిసెల" వని రామయ్యగారు విశ్వనాథుని పాదములను గనుల కద్దుకొనిరి — "ఇందులో నేఁ జేసిన దేమున్నది ? అంతయును భగవదిచ్ఛ. మీకృష్ణరాయ లను విద్యాభ్యాసమునకై నాయొద్ద కంపవలయును. అదే నా కోరిక." అని చెప్పి విశ్వనాథుఁడు వెడలిపోయెను. రాయలపై విశ్వనాథుని కట్టి సదభిప్రాయము కలుగుట తమ యదృష్టమని రామయ్యగా రనుకొనిరి.

త్వరత్వరగఁ బల్లపు వ్యవసాయమునకుఁ బనులు ప్రారంభింపఁ బడినవి. ఎడ తెగక నీటిజల వచ్చుచున్నది. ఒక నీటి చుక్కనైనను వృథాగాఁబోనీక పొలములకుఁ బెట్టుచుండిరి. నీరు వేయి యెకరములకును బ్రవహించినది. చూచుచుండఁగనే కుమారదేవ మంతయు మాగాణి భూముల మయమైనది. ఆవేయియెకరములు రెండుపంటలు పండును రామయ్యగారికిఁ బిత్రార్జితమైన యాస్తియును గ్రొత్తగాఁ గొన్న భూములును గలిసి మొత్తము నాల్గువందల యెకరమున్నది. దానిలో రెండువందల డెబ్బదియెకరములు సాగైనవి. రామయ్యగారి కిప్పుడు తీరుబడిలేనంత పని కలిగినది, అందులకుఁ దోడాయన 'గ్రామపెద్ద' గఁ గూడ నెన్నుకొనఁబడిరి.

పుత్త్రలాభమునతోఁ బాటింత యదృష్టమాకస్మికముగ గలసివచ్చుటకు రామయ్యగారును, ఈశ్వరమ్మగారును మహానందపడిరి. ఆబాలునిపేరు కేశవమూర్తి. రాబాలు జననమే తామొక మహాసౌధమును నిర్మించుటకుఁ గారణ మయ్యెను. కేశవునిపుట్టుక అనుకోనియొక మహైశ్వర్యమును సునాయాసముగా సమకూర్చినది. ఇట్టితలంపులచే నిలువెల్ల నిండియున్న యాదంపతులకుఁ గుమారులపై నింతింత యనరాని ప్రేమ కుదురుకొనెను. తరువాత నీశ్వరమ్మగారికిఁ బుత్త్రిక జనించెను. ఆమె పేరుభవాని. కేశవుఁడు నడక మొదలుపెట్టినప్పటి నుండియు రామయ్యగారు వానిని దమతోఁగూడఁ బొలములకుఁ దీసికొని వెళ్ళెడివారు. విశ్వనాథుని యాదేశ మెల్లప్పుడును జ్ఞప్తియం

దుంచుకొనుచుఁ దమ పెద్దకొడుకు చదువుకొను ననియును జిన్నకొడుకు వ్యవసాయము చేయించు ననియు రామయ్యగా రందఱకును జెప్పుచుండెడివారు. ఈసారి రామయ్యగా రుద్యాన వనములోఁ జిన్నకోనేటిని ద్రవ్వించి సీటిజల వచ్చు ప్రదేశమును నుండి తూములమూలమున నీటిని బ్రవహింపఁజేసి కోనేరునింపి నారు. ఆ కోనేటిలో నక్కడక్కడ నల్లగలువ, తెల్లదామర దుంపలు నాటబడినవి.

కృష్ణరాయల కేడవయేఁడు వచ్చినది. అన్నమాటప్రకా రము రామయ్యగారు కుమారుని దోడ్కొనిపోయి విద్యా భ్యాసమునకై విశ్వనాథుని కప్పగించినారు. సరిగా నా సమయ మున కే విజయేశ్వరాధీశులగు రాజా కుమార రామమోహను లును దమ యేకైక కుమార్తెయగు రజనీకుమారిని వెంటఁబెట్టు కొని యాశ్రమమునకు వచ్చిరి. ఇది విశ్వనాథుని యేర్పాటు. రజనీకుమారి విశ్వనాథుని యభిమానపుత్రిక. కృష్ణరాయ లును రజనీకుమారియును విశ్వనాథుని కొకే పర్యాయము నమస్కరించిరి. విశ్వనాథుఁ డాయిరువురను జెఱియొకప్రక్కను గూర్చుండబెట్టుకొని వారిశిరస్సులనుగలిపి మూరొన్నినాఁడు. లోన నేమో యాశీర్వదించుకొనినాఁడు. ఆ స్థితిలో వారలను జూచి రామయ్యగారు రాశ్చర్యపడినారు. రామమోహనులు మందహాస మొనర్చిరి.

ఆశ్రమమును ప్రవేశించునాఁటికి రజనీకుమారి కైదవ యేఁడు. అక్షరాభ్యాస మారంభముగా రెండుసంవత్సరములు వారిరువురును విశ్వనాథు నాశ్రమమునందే యుండిరి. ఈ రెండేండ్లలోను మాతృభాషా, దేవభాషా పరిచయములు మాత్రమైనవి. వారిరువురు నవ్యక్తమధుర భావములతో, నాచార్యుని బోధనలను మనస్సులకుఁ బట్టించుకొనుటలో నా రెండేండ్లను రెండునిముసములవలెఁ గడపివేసిరి. పిమ్మట గుర్వాజ్ఞానుసారము రాత్రు లచ్చటనుండుట మానివేసిరి. ఉదయముననే యశ్వ శకటములపై నిరువురు నాశ్రమమునకువత్తురు. సాయంకాలము వఱకు నచ్చటనుండి, మఱలిపోదురు.

పిమ్మట విశ్వనాథుఁడు శిష్యు లిరువురకును బంచకావ్యములలో నైషధము తప్ప తక్కిన నాల్గుకావ్యములను గొన్ని నాటకములను గాదంబరిని బూర్తిచేసినాఁడు. ఇవి పూర్తియగు నప్పటికి నాల్గుసంవత్సరములు పట్టినవి. శిష్యు లకుంఠితమగు దీక్షతోఁ జదివినారు. ఒకరినొకరు మించవలెనని వారిలో వారికిఁ దెలియకుండఁ బ్రయత్నించెడినారు. విద్యాభ్యాసమునందు వారికున్న పట్టుదలను జూచి "నా విజ్ఞానమునకు వన్నెపెట్టు శిష్యులు దొరికినా" రని విశ్వనాథుఁ డమందానంద మందుచుండును. ఈ చదువులోఁ బ్రపంచచరిత్రాభ్యాసముకూడ నొక భాగము. మధ్యాహ్నమందు విశ్వనాథుఁడు విశ్రమించు సమయమునఁ గృష్ణరాయలును రజనీకుమారియును వ్రేలాడుచున్న మఱ్ఱియూడల యుయ్యాలలపై నూఁగుచుందురు. వారి కది

యెంతయో యానందదాయకము. ఇరువురొక్కచోటనేకలసి చదువుకొందురు; ఒక్కచోటనే యాడుదురు; ఒకచోటనే మధ్యాహ్నభోజనము చేయుదురు; ఒకచోటనే తోఁటపనిచేయుదురు. స్వచ్ఛమగు వారి పసిమెడఁదలలో నెడమఱికలే లేవు.

రజనీకుమారికిఁ బొమ్మిదవయేఁడు వచ్చుటతోడనే విశ్వనాథుఁ డామెకు సంగీతమును కూడఁ జెప్ప నారంభించెను. సప్తస్వరములతోఁ బ్రారంభించి యామెకు పండెండవయేఁడు వచ్చునప్పటికిఁ జక్కని రాగజ్ఞానమును గలిగింపఁజేసినాఁడు. ఇంక రాయలకు ఆయుర్వేదమును, ధరశాస్త్రమును బోధించెను. అట్లు రజనీరాయలు విద్యాభ్యాసములో మొదటి యాఱేండ్లను గడచిపోయినవి. ఆశ్రమప్రాంతము లన్నియును గాఁఅడవివలె నున్నను రజనీకుమారికిని కృష్ణరాయలకును భయ మనునది లేదు. తోఁటపని లేని సాయంకాల మిరువురు నా యున్న యడవిలోఁ జిత్తము వచ్చినట్లు తిరిగెదరు. ఒక పరుగులేకాదు, ఒక దాఁగిలిమూఁతలేకాదు, ఒక కోఁతికొమ్మచ్చులేకాదు, అన్ని చిలిపియాటలును. ఒక విచిత్ర సంఘటనమువలన వారిరువురును శాంత్యహింసల మూర్తియైన తమ యాచార్యుని ప్రభావమును గుర్తించిరి. కావుననే వారికి భయమునాస్తి. ఆ విచిత్రసంఘటన మిది —

రజనియు రాయలును ఆశ్రమమునకు వచ్చిన క్రొత్తలోఁ జిఱుతపులి యొకటి భీమోలు ప్రాంతముల యడవులనుండి బయలుదేరి దారిఁబడిన గ్రామపశువులను జంపి తినుచు విజయే

శ్వరపుఁ బొలిమేరలోఁ బ్రవేశించినది. దానికథను గర్ణాకర్ణిగా వినుచున్న ప్రజల కది పొలిమేర వఱకు వచ్చినదని తెలియుట తోడనే ప్రాణము లఱచేతులలో నిలిచినవి. వేట యన్నచో నుత్సాహపడు కుమార మోహానులు తుపాకిని దీసికొని మేటి విలుకాండ్రైన యొక కోయవారను మద్దత్తుగాఁ దోడ్కొని పోగా చిఱుతను వేటాడుటకై బయలు దేరిరి. జామున్నర ప్రొద్దెక్కినది. చుట్టుప్రక్కల నావుల మంద గాని, మేకలదొడ్డిగాని లేక పోవు టచేఁ జిఱుతపులి పిచ్చియెత్తినట్లు తిరుగుచు విశ్వనాథు నాశ్రమప్రాంతముల వారిరువురికిఁ గంటఁ బడినది. పులి వారిని జూడలేదు. కాని కుమార మోహానులు కాల్చిన తుపాకిగుండు వెంబడినే యది వారిపై నురికినది. అంతలోఁ గోయవాఁడు విడిచిన యమ్ము వచ్చి దాని కుడిడొక్కలోఁ గ్రుచ్చుకొనెను. ఆ రెండు దెబ్బలును గాఢముగఁ దగులుటచే నది వారిపై నొక లంఘింప నేరక వెనుదిరిగి పరుగిడినది. వారిరువురును దానిని వెన్నంటిరి. చిఱుత సరాసరి వటవృక్షముక్రిందికి వచ్చినది. ఇఁక నడువలేకపోయినది. విశ్వనాథుఁ డా వృక్షమూలమున ధ్యానములో నున్నాఁడు. యోగమూర్తియైన విశ్వనాథుని ప్రశాంతముగు మోము కంటఁబడఁగనే చిఱుత తన బాధను గ్రూరతనుగూడ మఱచిపోయి వాని పాదములను నాకసాఁగెను.

విశ్వనాథుఁడు కొలదిసేపటికిఁ గనులు తెఱచి పాదములను నాకుచున్న చిఱుతనుజూచి చిఱునవ్వున దానియొడలుప్పిమి రెను. అది సాఁగిలిపడి తోఁకయాడించినది. విశ్వనాథుఁడు దాని శరీర

మందున్న బాణమును మెల్లగ నీవలకు లాగి కమండలువులోని గోదావరినీటితో గాయమును గడిగి సమీపమునందున్న యొక యాకును దెచ్చి పసరుపిండి గాయముల పైఁ బూసెను. అంతలోఁ గుమారమోహను లాశ్రమమును బ్రవేశించిరి. విశ్వనాథుఁడు తుపాకితోనున్న విజయేశ్వరాధీశులకు మందహాసముతో స్వాగత మొసంగెను. చిఱుత తనహంతను గుర్తించి మరణ వేదనతో రామమోహనులవైపు దీనముగఁ జూచినది. రామ మోహనులమనస్సునీరై పోయెను. విశ్వనాథుని యలౌకికశక్తికి విభ్రమమంది తాము వహించిన క్షాత్రధర్మమునకు సిగ్గిలిరి. నాఁటినుండియు రజనికిని రాయలకును భయమన్నది లేదు.

ఆఱేండ్లు పూర్తియగు నప్పటికి రజనియు రాయలును దమతమ యభిమాన విద్యలయందుఁ బ్రత్యేకముగు కృషిచేయుటకు శక్తిమంతులైరి. సంగీత సాహిత్యాచార్యుఁడగు విశ్వనాథుఁడు రజనీకుమారికిఁ బండ్రెండవయేఁడు వచ్చుటతోడనే యామెకు వీణను బ్రారంభించెను. రాయలు పాణినీయము నేకాగ్రచిత్తముతోఁ జదువ మొదలిడెను. అప్పుడప్పుడు విశ్వనాథుఁడు వారిరువురను గలిపి భరతశాస్త్రము నితరాలంకార గ్రంథములను జెప్పుట కారంభించెను. పాణినీయమును, నైషధమును, జ్యోతిషమును బూర్తిచేసి రాయలు తెలుఁగు కావ్యములను జదువ మొదలిడెను. అప్పటికి రజనీకుమారి వీణపై త్యాగరాజ కృతులను సాధించెను. రాయలతోఁ గలిసి యామె యునుగొన్ని యాంధ్రగ్రంథములను జదివినది. పిమ్మట బ్రత్యేక

ముగా సంగీతముపైనే దృష్టియుంచి ప్రతిభావంతుఁ డగు విశ్వ నాథునిక్షేత్రభూమలో నామె భూమి కవతరించిన శారదాదేవి యైనది. రాయ లాచార్యుని సాహాయ్యముతో నాంధ్ర కావ్యములం దపూర్వమగు కృషిని నల్పినాఁడు.

విద్యాపథములు వేఱైనప్పటి నుండియు వారిరువురును గూడదూరదూరముగ నుండసాఁగిరి. అదియునుగాక యీావలకు వలెసావకాశముగ మాటలాడుకొనుటకైనను వారికి వీలుచిక్కెడిదికాదు. ఒక వేళ వీలుచిక్కినను బూర్వమంత చనవులిప్పుడు లేవు. రాయలకుఁ 'బెద్దమనిషి తరహా' వచ్చినది. రజని పొడ వెదిగి వలెవాటుతో నొడలు నింపుకొనసాఁగినది. అలంకారాది శాస్త్రగ్రంథములను, గొన్ని తెలుఁగు కావ్యములను జదువునప్పుడు తప్ప వారిరువురును, వేఱువేఱుగా పాఠములను జెప్పించుకొందురు. చెలియొక చోటఁగూర్చుండి తమతమ ప్రాఁత క్రొత్తపాఠములను సమన్వయించుకొనుచుందురు. మధ్యాహ్న సమయములం దెప్పుడో కాని వారుయ్యాలల నూఁగుట మాని వేసిరి. రజనికిఁ బెంపుడు జంతువు లన్నచోఁ జాల నిష్టము. రాయలు దూరముననుండి యా జంతువులను జూచుచు నానందించు వాఁడే కాని పోషణ చేయుటకు దొరకొనఁడు. సాయంకాలమునందు మాత్ర మిద్దరును వంతులు వేసికొని తోఁటవని చేయుచుందురు. అప్పుడు వారి నిండ్లకుఁ గొంపోవ గుఱ్ఱపు బండ్లు వచ్చును.

భవాని పైకి దేండ్లు రాఁగానే కృష్ణరాయలే యామె కక్షరాభ్యాసము చేసెను. భవాని చాలఁ జుఱుకైన పిల్ల. పది యవ నెలలోనే యామెకు మాటలు వచ్చినవి. పదునొకటవ నెలలోఁ జెరచెర నడచినది. ఆమె యన్నచో రాయల కెంతో ముద్దు. ఆతఁడాశ్రమమునుండి వచ్చి బండి దిగునప్పటికి భవాని వాని కెదురుగా వచ్చెడిది. ఆమె నమాంతముగా నెత్తుకొని రాయలీశ్వరమ్మగారియొద్దకు వచ్చెడివాఁడు. కిలకిల నవ్వుచున్న భవాని నెత్తుకొని, చిఱునగవు పెదవులమీఁదను, ఆనందము కన్నులలోను, ఔన్నత్యము మొగమునందును దోఁచుచుండ, ఒక మహాపురుషుని ఠీవితోఁ దనయొద్దకు మెల్లగ నడచివచ్చెడి రాయలనుజూచియీశ్వరమ్మగారానందపరవశురాలై మాటాడ లేక పోయెడివారు. ఆచల్లనితల్లిలో వాత్సల్యజన్యమగు పర వశత్వమేకాని కించిద్గర్వమైన నెన్నఁడును దలచూపలేదు. ఆప్రీతియంతయు నాతల్లిచల్లనిచూపులోఁ దరంగించుచుండెడిది.

అక్షరాభ్యాస మైనప్పటినుండియు భవాని శ్రద్ధతోఁ జదువుకొనెడిది. రాయ లింటికి వచ్చుటతోడనే ప్రాతపాఠము నప్పగించుటయుఁ బెందలకడనే భోజనము లైన తరువాతఁ గ్రొత్తపాఠమును జెప్పించుకొనుటయు జరుగును. అట్లు చదువు చెప్పుటకుఁ బగలంతయును జదువుకొనివచ్చి మరల రాత్రి చదువుకొనవలసియున్న రాయలకు విసుగు లేదు. చదువుకొను టకు గృహకృత్యములలోఁ దల్లికి సాయ మొనర్చు భవానికిని విసుగులేదు. రాయలు పాఠముచెప్పి వెళ్ళిన తరువాత కేశవ

మూర్తి వచ్చి చెల్లెలియొద్ద కూర్చుండును. కేశవుఁ డెప్పుడును రాయలున్న చోట నుండఁడు. ఆ యన్నదమ్ము లిరువురు నెన్నఁడును మాట్లాడుకొనినట్లే యుండదు. వారి ప్రకృతులే చాల చిత్రమైనవి. రాయులకు సాహిత్యపాఠమన్నచో నెంతయిష్టమో కేశవునకు గోసేవ యన్న నంతప్రీతి. కేశవుఁ డక్షరములను జెల్లెలియొద్ద నేర్చుకొనినాఁడు. చెల్లెలియొద్దనే పుస్తకమును జదువ నారంభించెను. కాని వానికి గోసేవమీఁద నున్నంతప్రీతి మఱి దేనిమీఁదను లేదు. తమ యావుల మందలోనున్న యొక పడమటూ వన్నచో నాతనికిఁ బ్రాణము. మిలమిలమని మెఱసి పోవు తెల్లనిపట్టువలె నా యావు శరీర ముండును. ఇప్పు డది మొదటియీఁత యీనినది. ఈ రెండింటి సంరక్షణ యంతయును గేశవుఁడు స్వయముగఁ జూచుకొనుచుండును.

రజనీకుమారీ కృష్ణరాయల విద్యాభ్యాసము పూర్తికా వచ్చినది. ఏండ్లు గడచినకొలఁది ఒకరిపై నొకరికి గాఢానురాగ మేర్పడినది. కేవల సహాధ్యయన స్నేహము క్రమపరిణామము చెంది వారి హృదయగత భావములకు నిదానమును, గాంభీర్యమును దెచ్చిపెట్టినది. పెద్దవారైనకొలఁది వారు దూర దూరముగ నుండసాఁగినను, సంగీతసాహిత్యములు తమ గురుపాదుల మేధయం దైక్యమైనట్లే తత్తత్కళావేత్తృత్వమును సంపాదించుకొన్న యా యిరువురి యాత్మల యైక్యమును వృద్ధినొందసాఁగెను. ఆయైక్యమును వారికిఁ దెలియకుండఁగనే వృద్ధినొందినది. వారు పూర్వ మెంత నిర్మలమానసములతో సంచరిం

చెసీవారో ఇప్పుడు నంతే. కొంతెఱిన మెవ్వరిలోను లేదు. శ్రావణపూర్ణిమనాఁడు జరిగిన దొక్కటే సంఘటనము. ఆ నాఁడైనను ఒకరిభావముల నింకొకరికిఁ దెలియఁ జెప్పుకోలేక పోయి వానలో మాత్రము తడిసినారు.

రజనియూ రాయలును దమతమ యభిమాన విద్యలం దాఱు సంవత్సరములు గట్టికృషి సల్పిరి. విశ్వనాథుఁడు తన విజ్ఞానము నంతటిని శిష్యులకుఁ బూర్తిగఁ బంచి యిచ్చివేసి నాఁడు. సంగీతమందు రజనియు, సాహిత్యమందు రాయలును నిగ్గుదేరినారు. విశ్వనాథుని కిప్పుడు దాదాపుగ నఱువదినంవత్స రము లున్నవి. గతించిన పండ్రెండేండ్లును వానికి శిష్యులతోఁ బ్రొద్దుపోయినది. ఇఁక తానొక్కఁడే యాశ్రమమునం దుండ వలెను. ఒక్కసారిగ శిష్యులను విడిచి యుండవలయునన్న తలంపే వానికిఁ జాలఁ గష్టమనిపించినది. అందువలన వారిని మఱి పది, పదేనురోజులు పూర్తిగ నాశ్రమమునందే నిల్పి నాఁడు. తా మింకను బదిరోజులపాటు కలిసి యుండవచ్చును గదా యని వారిరువురు సంతోషించిరి. దశమిలోపలఁ గృష్ణ యీనినది. ఈనినంతనే రజని దానికి వేడి గంజి తెప్పించి పట్టించి సకలోపచారములు గావించెను.

నేఁడు వారిఁక వెడలిపోవుదురు శిష్యు లిరువురును బ్రయాణమై యాచార్యునితోఁ గుటీరప్రాంగణములోనికివచ్చిరి. ఇరువురు శిష్యులు నాచార్యుని కొకేసారి పాదము లంటి నమస్కరించిరి. వాత్సల్యపూర్ణుఁడగు విశ్వనాథుఁడు వారి

చేతులను గలిపి ముద్దిడుకొనినాఁడు. రజనియు రాయలును జెంతి యొక ప్రక్కనున్నారు. విశ్వనాథుఁడు వారి శిరస్సులను గలిపి మూర్కొనినాఁడు. రజనియు రాయలును బ్రథమమున నాశ్ర మమునం దడుగిడి సమస్కరించినప్పుడును విశ్వనాథుఁ డిట్లే చేసినాఁడు. నాఁడాతఁడు లోలోన నేమేమో యాశీర్వదించు కొన్నాఁడు. నేఁ డా యాశీర్వాదము పెదవి దాఁటినది — "మీ మనోరథము నెఱవేరుగాత" అని. ఆ యుచ్చారణలో బ్రశాంతత యున్నది. గంభీరత్వ మున్నది. సామాన్యాశీర్వా దమువలె నున్నది. వారి యిరువురి మనోరథమేమో యెఱిఁగి యాశీర్వదించినట్లున్నది. శిష్యు లిరువురు సంతోష సంభ్రమా శ్చర్యములు ముప్పిరిగొన నొకరినొకరు చూచుకొనిరి. ఇరువురి మనోరథ మొక్కటియే యగునా ?.........

"నీ మనోరథమేమి ?" యని రాయలకనులు ప్రశ్నించి నవి — "...నీ మనోరథమే !" యని యన్నట్లు రజని నునుసిగ్గునఁ దలవంచెను. రాయలు మందహాస మొనర్చెను. తమ రహస్య మాచార్యుల కెట్లు తెలిసెను ?...ఏమో !... ఇరువురు నాశ్చర్యమానసు లైరి.

"స్వామీ ! గురుదక్షిణ" యని రాయలుబద్ధహస్తుఁడై నిలిచెను. విశ్వనాథుని మోము దివ్యతేజమున వెలుఁగొందు చున్నది. శిష్యులు ఘనులైరని వానియానందము పట్టరా కున్నది. "పుత్రులారా ! మీరు సౌఖ్యముగ నుండి, నేను మీకొసఁగిన విద్యలను సఫలమొనర్చుటయే నాకు గురుదక్షిణ.

రాయలూ ! విద్యకు సార్థకత చతుర్విధ పురుషార్థసిద్ధిలోనున్న దని నీకు నేను వేఱుగాఁ జెప్పనక్కఱలేదు. కాని విదేశ సంపర్కమువల్లను, మనదురదృష్టమువల్లనునేటికర్థకామములు రెండు మాత్రమే నిల్చియున్నవి. అందుచే యోగముకన్నను మహితములును, సర్వజన సన్నిహితములు నగు కళ లటుపారమార్థికములు నిటు ప్రాపంచికములు రెండునుగాక తుచ్ఛములైనవి. రజనీకుమారి సాహాయ్యముతో వానిని బునరుద్ధరించుభారము నీది. ఇది మాగురుపాదుల సందేశము. మీా కందిచ్చితిని. ” అని నిర్వికారుఁడగు విశ్వనాథుఁడు పలికెను. శిష్యులు వినమ్రములైనారు. తమ జీవితములను కళల యున్నతికై ధారవోయుదుమని నిష్కల్మషహృదయములతో వారుశపథములను గైకొనిరి. విశ్వనాథుఁడు శిష్యులను గాఁగిలిలోనికిఁ దీసికొని యానందబాష్పములచే వారి శిరములను దడిపివేసెను. ఆజానుబాహువగు విశ్వనాథుని యండలో రజనియు, రాయలును మూఁగభాషలో నేమో మాట్లాడుకొనిరి.

విజయేశ్వరము గోదావరి నదికి దిగువగా నున్నది. మాధవీమందిరమున కెగువగాఁ బోవలెను. గుఱ్ఱపుబండ్లు సిద్ధముగా నిల్చియున్నవి. “ మరల కలయిక యెప్పు ” డని రాయ లడిగెను — “ ఆచార్య ననుమతి... ” అని రజని బదులు చెప్పెను. ఇరువురును శకటముల నారోహించినారు. విడఁదీసికోరాని వారి చూపులను గుటీరాంగణమునుండి విశ్వనాథుఁడు చిఱునగవుతోఁ బరికించుచునేయుండెను. గుఱ్ఱముల

వేగము హెచ్చినది. క్రమముగా శకటములు గుఱ్ఱముల డెక్కలవలన రేగిన పలుచని దుమ్ములో లీనమైపోయినవి. నాఁటి సాయంకాల మాశ్రమమునకు రమ్మని విశ్వనాథుఁడు రామయ్యగారికిఁ గబురంపెను. ఆయన యాశ్రమమునకు వచ్చునప్పటికి విజయేశ్వరాధీశులుకూడ వచ్చుటనుండిరి. లోకాభిరామాయణ మైన పిమ్మట విశ్వనాథుఁడు కనుసైగ చేయగా రామమోహనులు తమ కుమార్తెను గృష్ణరాయల కిచ్చి పెండ్లి చేయ నిచ్ఛగించుచుంటిమనియుఁ దమ యంగీకారము నొసంగవలసినదనియు రామయ్యగారిని గోరిరి. రామయ్యగారి కాశ్చర్యము నానందము నొకేపరి కల్గినవి.

"పిచ్చుకగూఁటిపై భాగీరథి ప్రవహించుచున్నది. వలదనువా రుందురా !... ఇది యంతయు విశ్వనాథుని కృప" అని రామయ్యగా రనలేక యనలేక యన్నారు. రామయ్యగారి యంగీకారము రామమోహనులకుఁ గర్ణోత్సవ మయ్యెను. విశ్వనాథుఁడు ముహూర్తమును నిర్ణయించినాఁడు. అందఱకన్నవారియానందము పట్టపగ్గములు లేకున్నది. రామయ్యగారింటికి వచ్చి యీశ్వరమ్మగారి నొక్క కేక వేసినారు. సంగతి విని "నిజమా?..." అని మాత్ర మీశ్వరమ్మగా రనిరి. రజనీకుమారిని గూర్చి రాయ లప్పుడప్పుడు చెప్పగా నామె వినియుండెను. ఆమె తమ కోడలగునేమో యన్న యూహ రామయ్యగారికి నామెకు నిదివఱకే తట్టకపోలేదు. అది నేఁడు నిజమైనది. ఇఁక వారి యానందమున కంతేమి యున్నది ?...

ముహూర్తము నిశ్చయమైనదని విన్న రజనికిని రాయలకును ఆ రాత్రి నిద్ర పట్టనేలేదు.

## 5

వర్షర్తు ప్రారంభములో రజనీకుమారీకృష్ణరాయలవిద్యాభ్యాసము పూర్తియైనది. శరత్తులో రాయలు దేశసంచారముజేసి తనప్రతిభను నలుమూలలను జాటి వచ్చినాఁడు. అవి పాశ్చాత్యవ్యామోహము పూర్తిగాఁ బ్రబలిన రోజులు. ఒక ప్రక్క జాతీయమహాసంస్థ, మహానాయకుల యాధ్వర్యమున దేశాభిమానమును, ఐకమత్యమును, బ్రబోధించుచున్నను, వేఱొకప్రక్క నల్లదొరలెందఱో తెల్లదొరల మానసపుత్రులై రాజభక్తిని బ్రకటించుచు నేయుండిరి. తమయాచార్యుని స్నాతకోపన్యాసమును, దేశపరిస్థితులను సమన్వయించి చూచుకొని రాయలు తన భావిజీవిత కర్తవ్యము సుసాధమైనది కాదని గ్రహించినాఁడు. కళలను బునరుద్ధరించు మార్గమేమి?...అది తనచేనగునా? ... రజనీకుమారి యేవిధముగా సాయపడునో? ... రాయ లేమియును నిర్ణయించుకొనలేకపోయెను.

శిశిరర్తువులో రజనీకుమారీ కృష్ణరాయల వివాహము సర్వవైభవోపేతముగా జరిగినది.

భవానికి శరదృతునంతమునకుఁ బదునాల్గవయేఁడువచ్చినది. తనతోఁబాటుగా నాశ్రమమునకు వచ్చి తమ గురుపాదుల యొద్దనే చదువుమని తన విద్యాభ్యాస కాలములో రాయలు

చెల్లెలికిఁ బెక్కుసారులు బోధించెను. ఆమె యంగీకరింపలేదు. "నిన్ను జూపించుమని రజనీకుమారి చాలసారు లడిగినది. ఆమెను జూచుటకైన నీవు ఒకసారి రాఁగూడదా ?" అని రాయలు భవాని నడిగెను. "నన్ను జూడవలెనని యామె యంత యుత్సహించుచో నామెనే యొకసారి యిచ్చటికి రమ్మనుము" అని భవాని సమాధాన మొసంగెను. రాయలేమియును జెప్పలేక పోయెను.

"అయినను ఆశ్రమమునకు వచ్చుటకు నీకభ్యంతరమేమి భవానీ !" – "అన్నా ! నేను నీకు శిష్యురాలి నగుదును. నా సోదరుఁడే యొక మహావిద్వాంసుఁడై యుండఁ జదువునకు నే నింకొకరి కడ కేఁగనేల ? అంతేకాక నేనుగూడ నాశ్రమమునకు వచ్చుచో నింట గృహకార్యనిర్వహణముతో నమ్మకుఁ దోడుపడువా రెవ్వరు ?... పెద్దది యగుచున్న కొలఁది నామెకును నోపిక తగ్గుచున్నది." అని భవాని సమాధానమిచ్చెను. రాయలుసంతృప్తినొంది మరల నాప్రస్తావన నెన్నఁడును దేలేదు. కాని అప్పటి నుండియు రాయలు ద్విగుణీకృతోత్సాహముతోఁ జెల్లెలికిఁ జదువు చెప్పెను. అంతకు మూఁడింతలు పట్టుదలతో భవాని చదువుకొన్నది. అన్నకును, రజనీకుమారికిని వివాహము నిశ్చయమైనరాత్రి భవాని రాయలయొద్దకు వేగముగా వచ్చినది.

"అన్నయ్యా ! ఒక్కసారియైన రజనీకుమారిని మన యింటికి రమ్మనుటకు సిగ్గుపడినావు. జమీందారుల బిడ్డయని నీ

యూహకాఁబోలు. ఆమెయిఁకమనయింటిలో నేతిష్ట వేయునఁట. నీవుమాత్ర మింకను సిగ్గుపడెదవేమోసుమా!" అని యన్నది. రాయలు నవ్వి యూరకుండెను. చిన్నప్పటినుండియు నున్న చురుకుఁదనము భవానిలో వృద్ధినందుచు వచ్చినది. 'మనిషి' బక్కపలాచగాతగినంతపొడవుగానుండును. మొగముకోంచెము కోలగా, సౌందర్య రేఖాసమన్వితమై యుండును. ఆమెవిగ్రహ ములో నచ్చువుఁదెనుఁగుఁదనముట్టిపడుచుండును. అన్న కల్గించిన విద్యాసంస్కారమునకుఁ దోడుగ నామెకుఁ దల్లికడ లోక జ్ఞాన మలవడెను. ఇవి యన్నియును గాక, అమె కాత్మవిశ్వాస మెక్కువ. తనకుఁదట్టిన దేసరియైనయూహయని యామెనమ్మిక. అది యహంభావ మనరాదు కాని ఆత్మవిశ్వాస మే యనవలెను.

రాయలు భవానికి గురువు; భవాని కేశవమూర్తికి. కేశవునకుఁ బండ్రెండేండ్లు వచ్చినప్పటినుండియు రామయ్య గారు వ్యవసాయపుఁ బెత్తన మంతయుఁ జిన్న కుమారుని కప్ప గించివేసిరి. వ్యవసాయపుఁబనులందు తీరికయే యుండదు. అట్లే తీరికచేసికొని చదువునకుఁ గూర్చుండెడివాఁడు. ఏ పుస్తకము నైనను అర్థముచేసికోఁగలశక్తి వానికి వచ్చినది. అంతేచాలు ననుకొనినాఁడు. కాని యెంతపట్టుదలలోనున్నను బడమటావు జ్ఞాపకమునకువచ్చెనేని చదువునకు స్వస్తిచెప్పవలసినదే. కేశవుఁ డొక విచిత్రవ్యక్తి. పడమటావు వానికాప్తురాలు. పాలేరులు చుట్టములు. పంటభూములు విహారప్రదేశములు. ఆతఁడు దయాస్వరూపుఁడు. ఎన్నఁడు నొకరి కపకారమొనర్చి యెఱుఁ

గ(డు. ఉపకార మొనరించి ప్రత్యుపకారము నాశింపఁడు. తల్లి దండ్రులన్నచో వానికిఁ బవిత్రభావము. అన్నను గారవించును. చెల్లెలిని గారవించును. అందులోఁ దన శిష్యభావముకూడ నున్నది. వాని నందఱును 'చిన్నబాబు' అని పిలుతురు.

వ్యవసాయపుఁ బనులతోఁ గాని, గృహకార్యములతోఁ గాని రాయులకు సంబంధము లేదు. సంస్కృతాంధ్రములం దాతఁడు గొప్ప పాండిత్యమునుసంపాదించెను. తెనుఁగున(బ్రౌఢ కవిత్వమును(వ్రాసెడినేర్పులవడినది. రాయలుకవియన్న(ప్రఖ్యాతి గోదావరినది రెండు(ప్రక్కలను వ్యాపించినది. వాని కంఠము చాల మధురముగనుండును. ఆతఁడు పద్యములను జదువుచోఁ బచ్చని వరిచేను-లికి నల్లనల్లన నూగిసలాడుచున్నట్లుండును. వానికంఠమునం దెంతయో యాకర్షణశక్తియున్నది. మొదటి నుండియు విజయేశ్వరాధీశులకు రాయులతోఁ బ్రసంగించుటన్న చాలనిష్టము. ఏకాంతమున విశ్వనాథుఁడు కూడ రాయల వచోమాధుర్యమును, వాని దినదిన(ప్రవర్ధమానమగు విజ్ఞాన మును రామమోహనులయొద్ద (ప్రశంసించెడివాఁడు. కావుననే రాయలన్నచో రామమోహనుల కింతయనరాని (ప్రేమయు, గౌరవము నేర్పడి తమయల్లునిగాఁ జేసికొనినారు. భవాని యన్నయొద్ద సంస్కృతాంధ్రములను చక్కఁగాఁజదువుకొన్నది. కొన్నికొన్ని (ప్రౌఢ(గ్రంథములనామెయన్నసాహాయ్యమక్కఱ లేకయే అర్థము చేసికొనఁగల నేర్పరియయ్యెను. పదుమూఁడవ యేఁటనే యామె గవిత్వమును జెప్పసాఁగెను. అదియును

జాల బాగుండెడిది. ఆమెదృష్టి నూత్నభావ సంకీర్ణములైన గ్రంథములవైపు మరలినది. అప్పటికే కందుకూరి, చిలకమర్తి మొదలగు పురోగాములు ప్రబంధశైలివీడి సంఘసంస్కరణా శయ పూరితములైన కావ్యములను రచింపఁబూనిరి. (భారత దేశములో మహాత్ముఁడికంటె ముందుగా ఆంధ్ర దేశములో చిలకమర్తివారు హరిజన సంఘసంస్కారమును బ్రారంభించుట సర్వజనవిదితము.) భవానియు నా మహామహుల కవిత్వము ననుకరించుచు ఖండకావ్యము లల్లసాఁగినది.

అప్పుడప్పుడు భవానియూ, రాయలును సాహిత్యవిష యములు ప్రసంగించుకొనుచుండురు. ఆ సమయమునకుఁ దా నింటనుండుట సంభవించినచోఁ గేశవుఁడు ప్రక్కగదిలోఁ గూర్చుండి వారిరువురివాదములను శ్రద్ధతో వినుచుండెడివాఁడు. అన్నగారి ప్రతిభావిశేషములను దలంచుకొని భవానియు కేశ వుఁడును విస్మయ మొందుచుందురు. భవానిదృష్టి జానపద కవిత్వముపైఁ బ్రసరించినది. చెల్లెలి స్వతంత్రాభిప్రాయముల నన్న ప్రశంసించి యాక్రొత్తమార్గమును ద్రొక్కినందుల కామె లోకమున కాదర్శప్రాయ కాఁగలదని యూహించుచుండును. రజనీకుమారి కాఁపురమునకు వచ్చినప్పటినుండియు ముువ్వురును గలిసి చాలసేపు ప్రసంగించుకొనుచుండెడివారు. సారస్వతవిష యికములగు చర్చలైనతరువాత రజనీకుమారి కొంతసేపు వీణవాయించి యందఱకు నానందమును గొల్పెడిది.

భవాని పదునాఱేండ్ల పడుచై నది. కేశవునికిఁ బదు నెనిమిది దాఁటినవి. ఆ యేఁడు భవానికి వివాహము చేయవలె నని యీశ్వరమ్మగారు సంకల్పించిరి. 'విధి దానంత నదే త్రోసికొనివచ్చు' నని రామయ్యగా రంతగా నీ విషయమై పట్టించుకోలేదు. గోదావరినది కావలియొడ్డున రామగిరి యను నొక పెద్ద జమీందారి కలదు. ఆ సంస్థానాధీశుఁడు గిరిరా వను నాతఁడు. వానికిఁ బాతికేండ్లుండును. వాని మొదటి భార్య యొక యాడుశిశువును బ్రసవించి చనిపోయినది. అతఁడు తన మొదటిభార్యను సరిగాఁజూడలేదనియు నొకవదంతి యున్నది. వానికింక "నా" యను వా రెవ్వరునులేరు. భవానిని దనకిచ్చి వివాహము చేయవలసినదిగాఁ గోరుమని యాతఁడు తనపురో హితు నాకస్మికముగా నొకనాఁడు రామయ్యగారి యింటికిఁ బంపించెను. అందఱి యిష్టానిష్టముల కేమికాని భవాని మాత్రము వానిని వివాహమాడుట కంగీకరించినది. ఆ కుటుం బములో నామె యిష్టమును గాదనువా రెవ్వరునులేరు.

భవాని గిరిరావుబాబు కథను గర్ణాకర్ణిగ వినియున్నది. ఆకథవినినప్పుడును, ఈనాఁ డాతఁడు తన్ను వివాహమాడఁగోరి సందేశమంపినప్పుడును, ఆతనిక్రూరత్వమున కాహుతియైనవాని భార్య విషాదగాథ వినినప్పుడును, దిక్కులేని యా యుత్తమ యిల్లాలి పసికందుబ్రతుకును దలఁచుకొనినప్పుడును, ఆమెకనుల నీరు నిండి యామెలో నేమిస్పందనముకల్గినదోకాని గిరిరావు బాబునే తాను వివాహమాడి యాతనిని మరల నొక సత్పురు షుని జేయ నామె సంకల్పించుకొనెను.

రామగిరినుండి గిరిరావుబాబు పురోహితులు కుమార దేవము వచ్చిననాఁడే సంజీవపురమునుండి యింకొక రాయ బారము వచ్చినది. సంజీవపురము భీమోలు ప్రాంతములలో నొక మొఖాసా. ఆమొఖాసాదారుకుమార్తె చంద్రావతియను నామెను గేశవమూర్తికిచ్చివివాహము చేయవలెనని యారాయ బారము. వివాహములు నిశ్చయమైనవి. ప్రథమమున భవాని వివాహము జరిగినది. భవానియందమును, సౌశీల్యమును, విజ్ఞానమును విని ముగ్ధుఁడై యున్న గిరిరావుబాబు, ఆమె మనస్సునుగూడఁ గరగింపవలె నను నిశ్చయముతోఁ దన వైభవమంతయుఁ బ్రదర్శించినాఁడు. భవానిపెండ్లియైనవారము రోజులకుఁ గేశవుని వివాహము జరిగినది. అంతవఱకును గిరిరావు కుమారదేవమునందే యుండిపోయెను.

నూత్న వధువులగు చంద్రాభవానులకు గాఢమైత్రి యేర్పడినది. చిన్నన్నగారి వివాహమైన వెంటనే భవాని భర్తతో రామగిరికిఁ బ్రయాణము కావలసియున్నది. కాని అందరు బలవంతపెట్టుటచే నాల్గురోజులుమాత్రము భవానిని బుట్టింట నుంచుటకు గిరిరావంగీకరించెను.

## 6

భవాని, చంద్రావతి, రజనీకుమారి — ఈముగ్గురును త్రివిధ సౌందర్య పూర్ణలు. ఉషా సౌందర్యము భవానిది. సంపూర్ణ శారదజ్యోత్స్నా సౌందర్యము చంద్రావతిది. రజనీ

కుమారి సర్వగుణపూరిత ; మఱియు మధుమాస సౌందర్య పూర్ణ. సౌందర్యసృష్టిరహస్యము ముప్విధముల నా ముప్వురి లోన నిమిడియున్నది.

ఈముప్వురిలోను జంద్ర నిరాడంబరజీవిని. పెదవుల్పెం జిఱునగ వెల్లప్పుడును దాండవించుచుండ నిరలంకారముగా నున్నప్పుడే యామె సహజమూర్తి మిక్కిలి మనోహరముగా నుండును. విగ్రహము పొడవును బొట్టియును గాక సమత్వము గలది. శరత్తులోఁ బుట్టినదగుటచే నామె యెల్లప్పుడును శరచ్చంద్రికవోలెఁ దెల్లని చలువబట్టలనే కట్టుచుండును. చంద్ర యంతగాఁ జదువుకొన్నది కాదు. ఇంటిపురోహితులే యే మాత్రమో చెప్పియున్నారు. దానినే యామె యింకొక కొంచెము వృద్ధిచేసికొన్నది. భవానియును, చంద్రయు నొకే యీడువారు. రూపగుణవిలాసములందిరువురు నించుమించుగా సమాన లనవచ్చును. కాని చంద్ర సౌందర్యమున మిన్న, భవాని విద్యాధికురాలు. చంద్ర లోకానుభవజ్ఞురాలగు తల్లికి శిష్యురాలు. భవానియును తల్లియొద్దనే శిక్ష పొందినను ఆమెకుఁ బుస్తకజ్ఞానమే యెక్కువ.

రజనీకుమారి వీరిరువురికంటె సుమారుమూఁడేండ్లుపెద్ద. ఆమె కేశవునికన్నను గొంచెము పెద్దది. అయిన నామెగూడ నా యిరువురితో సమానవయస్సు కలదానివలెనే యుండును. ముప్వురు నొకేరకపు దుస్తులను గట్టినచో వారిని గుర్తించుట కూడఁ గష్టమే ! ఈశ్వరమ్మగారా నాల్గురోజులు నా

ముప్పూరితోఁబాటు తామును నవయౌవనమును జెందినారు. అప్పుడు మాధవీమందిరములో మధువులే కురిసినవి.

రామగిరిసంస్థానాధీశుఁడగు గిరిరావు విలాసపురుషుఁడు. ప్రజల మొఱ నాలకించువాఁడు కాఁడు. గిరిరావుతండ్రిగారి కాలములో రామగిరి చాల ఉచ్ఛస్థితిలో నుండెను. కాని గిరిరావు మదోన్మత్తుఁడై నిర్భయుఁడై సంచరించి సంస్థానమును జిందరవందర చేసివేసినాఁడు. చిన్నతనములో నధికారము చేతికివచ్చినది. ప్రాయము, ధనము, అధికారము - ఈమూఁడును వానికున్న వివేకము నణఁచివేసినవి. సంస్థానమున కాదాయముక్రమముగాఁ దగ్గఁజొచ్చెను. పరిపాలన మంతయును దుష్టులచేతిలోనికేఁగినది. గిరిరావునకుఁ బానీయములును, స్త్రీజనమునున్నచోఁ జాలును. పరిపాలన మక్కఱలేదు. రైతు లుద్యోగస్థులచేఁ బీడింపఁబడిరి. వారి మొఱాలకించు నాథుఁడులేఁడు. రామగిరిసంస్థానమునకు దుర్గతి పట్టిన ప్రథమదివసము లవి.

గిరిరావు మొదటి భార్య యంత యందమైనది కాదు. కేవల మామెగుణసంపత్తికి మెచ్చియే గిరిరావుతండ్రిగారామెను దమ కోడలిగా నంగీకరించియుండిరి. ఆయనకును గిరిరావన్నచో సదభిప్రాయములేదు. గుణవంతురాలు భార్యయైనచో నామెయైన వానిని జక్కదిద్దుకొనునేమో యని యాయన యూహించెను. కాని గిరిరావునకుఁ గావలసినది రూపము మాత్రమే. అంతరూపవంతురాలు కానిభార్య వానికి నచ్చలేదు. క్రమముగా నామె మోమును జూచుటకూడ మానివేసి

నాఁడు. ఎప్పుడైన నెదురుపడినచోఁ జీదరించుకొనసాఁగెను. తనకాదరమెట్టిదైనను తనభర్త నడవడియుఁ దత్ఫలముగ రామగిరిసంస్థానమునకుఁ బట్టుచున్న దుర్గతియుఁ దలంపునకు వచ్చినప్పుడెల్ల నామెకు దుఃఖమాఁగెడిదికాదు. బెంగతో నామె కృశించిపోయెను. నెలలునిండిన సమయములోఁ దనకొక్కసారియైన దర్శనమీయవలెనని యామె భర్తకుఁ గబురుచేసెను. కాని యాతఁడు రాలేదు. శల్యావశిష్టయైయున్న యామెపడినప్రసవవేదన కంతులేకపోయినది. అనుభవశాలినులైన దాదు లతిప్రయత్నము మీఁదఁ బుట్టినయాఁడుశిశువునురక్షింపఁగల్గిరి. కన్నబిడ్డను రెండుకన్నులు విప్పి యాతల్లి చూచుకొనలేక పోయినది.

అవసానదశలోఁ గడసారిగ నొక్కపరియైన భర్తదర్శనమిచ్చునేమోయని యామె యాశించెను. గిరిరావువచ్చినవారిని జీవాళ్లుపెట్టి పంపించినాఁడు. ఆమె విరక్తిచెందినది. తన పసినిసుఁగు గతియేమి ? ఏమియునామెకుఁ దోఁచినదికాదు. కనులు మూసికొని తనకుఁగాఁబోవు సవతికి నమస్కరించి తన భర్తను సంస్కరింపవలసినదనియు, తన కన్నబిడ్డను సంరక్షింపవలెననియు నామె కోరుకొనెను. చుట్టునున్న వారందఱా దృశ్యమును జూచి కనుల నీరునించిరి. ఆమెతోఁ బుట్టింటనుండి వచ్చినదాది మాత్ర మామెయొద్దకువచ్చి "అమ్మా! నీ బిడ్డకేమియును భయము లేదు. నేను బెంచెదను. రాఁబోవు నమ్మగారును బసిపాపను ప్రేమగానే చూతురు. నీవు చింతపడవలదు." అని

యూరార్చినది. కృతజ్ఞతతో నామె శాశ్వతముగాఁ గనులు మూసెను.

కుమార దేవమున నాల్గువాళ్ళుండి భవాని రామగిరి కేఁగినది. మహావైభవమున భవాని నాహ్వానించి గిరిరావత్యున్నతసౌధమున నామెకుఁ దన యంతఃపురమును జూపించినాఁడు. ఆ యంతఃపురశృంగారమును జూచునప్పటికి భవానికన్నులు తిరిగి పోయినవి. ఆ యలంకారములను గలయఁజూచినంతనే భవాని కన్నులవెంబడి రెండశ్రుకణములు జారినవి. వానిని గాంచి యానందబాష్పము లనుకొని గిరిరావుప్పొంగిపోయెను.

అంతఃపురపరిచారిక లారాత్రి భవానిని సౌందర్యాధి దేవతగా నలంకరించిరి. ఆ పరమసౌందర్యమూర్తిని జూచి గిరిరావు చకితుఁడయిపోయెను. గిరిరావానందమును భరింపఁజాలక వేగముగా ముందునకు సాఁగినాఁడు. ఆమె చేయెత్తివారించినది. "ఒకింత యోర్పువహించి నామనవి వినుఁడని ప్రార్థించుచున్నాను. నేను మీకు భార్యనగుటచే నెల్లప్పుడును మీయధీనములోనిదాననే. మీకును, మీ బాలికకును సేవచేయుటయే నాజీవితపరమావధి. కాని మీరు ధనమదముతో నొక యుత్తమురాలగు నిల్లాలిమృతికిఁ గారణభూతులైరి. మీ నడతకు మీరు పశ్చాత్తాపమునంది యుత్తమ మానవ జీవితక్షేత్రమునకు యాత్రికులు కానంతవఱకు, నేను సార్థకమగు భార్యను గాఁజాలను. సౌందర్యవతి నన్న గర్వము నాకు లేదు. నాసౌందర్యము మిమ్ము సత్పథమునకుఁ దెచ్చుటకై

వినియోగపడినచో ధన్యురాలను.” అని భవాని చేతులను జోడించి నిల్చినది.

గిరిరావున కొక్కక్షణము మతి చలించినట్లైనది. — “భవానీ! నన్ను నీ వవమానించుటకుఁ బెండ్లియాడితివా? లేక నాయాస్తి నాశించి పెండ్లి యాడితివా?” — “మీరట్టి మాటలనకుఁడు. నేను మీచరణదాసిని!” — “ఈనీతులు నాకుఁ దెలియును. నీవు నా భార్యవు. భార్య భర్తమాట విని తీరవలయును. లేనిచో విననట్లు చేయఁగలశక్తి నాకున్నది.” గిరిరావు కంఠము కఠినమైపోయెను. — “నామమాత్రము మీరట్లు చేయఁగలరేమో! అప్పుడు శరీరమే మీవశమగును గాని నామనస్సు కాఁజాలదు.” — గిరిరావు కోపమును దట్టుకోలేక పోయినాఁడు. భవాని కదలక మనోధైర్యముతో హృదయమునఁ జేతులు కట్టుకొని యట్లనే నిల్చియున్నది. ఆమెకున్న యాత్మవిశ్వాసమువలన నామె చూపు లగ్గిమంటలై గిరిరావుమోముఁడు నరకట్టినవి. అతఁ డొక్కసారి భవాని నాపాదమస్తకమును బరిశీలించి తలవంచుకొని, వెనుదిరిగి, గదివీడి, వెడలిపోయెను. భవానికేమో తలక్రిందైపోయినట్లైనది. తన ప్రథమప్రయత్నమిట్లు విఫలమైనదేమి?

ఆమె కిఁక నక్కడ నిలుచుండుట కష్టమై మేడదిగి వచ్చెను. పరిచారికలు వెలవెలఁబోవుచు, భయంభ్రాంతలై నిలుచుండిరి. భవాని దాదితోఁ బోయి యొక చిన్నగదిలో మంచముపై బోర్లపడి యేడ్చుచున్న పసిపాపను జంకకు నెత్తి

కొనెను. గుక్కపట్టియేడ్చుచున్న యాపిల్ల యట్టెయూరకుండినది. పరిచారిక లాశ్చర్యపడినారు. ఆపాపకుఁ బదునొకండవ నెల వచ్చినది. కాని యింతవఱకును గిరిరా వాపిల్లను జూడలేదు. ఆపిల్లవిషయ మేమైన వచ్చినచో నాతఁడు చీదరించుకొనును. రామగిరివంటి సంస్థానాధీశుని యేకైకపుత్రిక యయ్యు నాపాప యనుభవించుచున్న దుఃస్థితికి భవాని గుండె తఱుగుకొనిపోయెను. ఆపాపయొక్క సంరక్షణభార మంతయుఁ దాను వహించినది. ఆమెకు 'భారతి' యని ముద్దుగాఁబేరు పెట్టుకొన్నది.

భర్తకుఁ జంద్ర తలలోనినాల్కగా సంచరించెడిది. చంద్ర యన్నచోఁ గేశవుని కింతింత యనరాని ప్రేమ. ఆపె మనస్సు నాతఁ డెప్పుడును జివుక్కురుమననిచ్చెడివాఁడు కాఁడు. ఈశ్వరమ్మగారును రామయ్యగారును దమతమ గృహభారములను జంద్రాకేశవులపై బూర్తిగా విడిచిపెట్టివేసి, యున్నది లేదన్న చికాకు లేక నిర్విచారముగఁ గాలము గడపసాఁగిరి. రజనీకుమారి యాగర్భశ్రీమంతురా లను నూహతోఁ జంద్ర మాత్ర మక్క సేపనియును జేయనిచ్చెడిది కాదు.

భర్తతోఁబాటు చంద్రయును గోసంరక్షణ మందు శ్రద్ధ వహించెను. కేశవుని కమతీములో మొత్త మఱువది వఱకును మంచిమంచి యావు లున్నవి. తక్కినపశువులు రెండు వందలవఱకు నుండును. ఒకేపర్యాయమాతఁ డిరువదినాగళ్ళను గట్టించెడివాఁడు. రామయ్యగారుకొన్నదికాక కేశవుఁడు మరల

నూటయేఁబదియొకరముల మెట్టభూమినిగొన్నాఁడు. ఇదివఱకుఁ గొన్న కొన్నిభూములను బల్లము చేయించుటచే మాగాణి వ్యవసాయము హెచ్చెచ్చెనది. పరోపకారమును గోసేవయు నా దంపతుల జీవితపరమావధి. ఏదే నొక సాహాయ్యమును రైతు లందఱును గేశవునివలనఁ బొందినవారే. ఊరంతయును ఊరిపెద్దయైన రామయ్యగారి ఒక్కమాటమీఁద నిలిచెడిది. ఆగ్రామ మొక భూతలస్వర్గమనుటలో సందియములేదు.

# 7

పండువెన్నెలలో రజనియు, రాయలు గోదావరియొడ్డున నొకబండఱాతిపైఁ గూర్చుండిరి. ఆయిరువురిపాదములునీటిలో నున్నవి. ప్రకృతిసౌందర్యావలోకన వివశులై, యచంచలులై యున్న వారి పాదములచుట్టును జిన్నచిన్న చేపలు చేరినవి. చంద్రకిరణములు పైఁబ్రసరించుటచే నవి మెఱుఁగుపెట్టిన వెండి ముక్కలవలెఁదళతళ మెఱయుచున్నవి. ఒక పెద్దచేప మెల్లగాఁ జేరి రజని పాదములను గఱచి పట్టినది. రజని యులికిపడెను. చేప లన్నియుఁ జెల్లాచెదరై పోయినవి.

"ఏమిటది రజనీ!" అని రాయ లడిగెను. రజని పాదములను నీటిలోనుండి వెలికిఁదీసెను. చేపకఱచినచోటనొప్పిగా నుండెను. ఆమె కిఁక నచ్చట కూర్చుండవలెనని లేదు. అందుచే రాయ లామెను నడిపించుకొనిపోయి ప్రక్కనే కట్టివేయఁబడి యున్న నావలోఁగూర్చుండఁబెట్టి "ఆజ్ఞ" యన్నట్లుగా బద్ధ

హస్తుఁడై నిలుచుండెను. రజని నవ్వుచు దక్షిణముగాఁ జూచి నది. ఒడ్డున గసికకుఁగట్టిన త్రాటి నూడఁదీసి వెదురుగడను జేతఁబట్టినాఁడు. రజని చుక్కానిపట్టినది. చంద్రుఁడు మింటిపై వారి ననుసరించుచున్నాఁడు. అది శుక్లపక్ష నవమి. చైత్ర మాసము. వసంత ర్తుప్రారంభదశ — "రజనీ! కోయిలలు నీకు జడిసి కూయుట మానుకొన్న విసుమా!" అని రాయలు నావకు రెండవ చివరను నిలిచి రజనిని బల్కరించెను. "ఏలాగో?" అని రజని ప్రశ్నించెను. "కోయిలలు కుహూస్వనము లొనరించును. నీవు ప్రత్యుత్తర మిచ్చెదవు. అది మనోహరాతిమనోహరము. అవి సిగ్గిలి కూయుట నిఁక మానివేసినవి. నీ కంఠమునఁ బంచమము కన్నను మిన్నయగు వేఱొంకుస్పృష్టి యుండనోపు. ఏమందువు?" రజని మాటాడలేదు.

రాయలు వెదురుగడను పీటి యడుగు భాగమున భూమిలో నదిమిపట్టి నావనుద్రోసికొనుచు నావయంచు వెంబడిని చుక్కానివఱకు నడచివచ్చెను. వెదురుగడ యూబిలో దిగఁబడి యుండుటచే లాగినంతనే సులువుగా నూడిరాలేదు. రాయలు బలముకొలంది గడను లాగినాఁడు. గడతోఁబాటుగా నీరును జెదరివచ్చి రజనిపైఁబడెను. ఆ నీరము మిక్కిలి చల్లగా నుండుటచే రజనిరొమ్ములు జలదరించెను. ఆ తొట్రుపాటునుజూచి రాయలు పరిహాసముగా నవ్వెను. రజని చుక్కాని విడిచిపెట్టి వేసినది. నావపోయి యొడ్డును డీకొనుటచే నిరువురును దూలి పడినారు. నావ నొడ్డునఁగట్టివేసి యిరువురును మామిడితోఁపు

లోనికిఁ బోయిరి. అది వారికిఁ బ్రియమైన స్థలము. మామిళ్ళు చాల నొత్తుగాఁబూసినవి. మామిడితోఁపునుదాఁటి కొంచెము ప్రక్కగా వెళ్ళినచో నచ్చట మంచిగంధపుఁ దోఁపున్నది. చతురముగా నున్న యావృక్షములనడుమ నొకటి చాల నేపుగాఁ బెరిగి పెద్దవృక్ష మైనది. మామిడితోఁపును వదలి రాయలును, రజనియు నీపెద్దగంధపుఁజెట్టువఱకును నడచివచ్చిరి. ఎందుల కంతదూరము నడచివచ్చిరో వారికే తెలియదు.

ఆయాసముతో రజని యాచెట్టుక్రిందఁ గూర్చుండఁ బోయెను. చిమ్మచీఁకటిగా నున్న మామిడితోఁపులోనుండి వచ్చుటచే వారి కింకను మసకలు పోలేదు. రజని కూర్చుండు నంతలో "పాము" అని రాయ లఱచినాఁడు. ఆమె భయముతో పరుగునవచ్చి రాయలవెనుక దాఁగుకొనెను. ఆగంధపుమ్రానిని జుట్టుకొని యొక తెల్లత్రాఁచు పరుండియున్నది. అలుకుడు విని యది తలయొత్తినది. వారు కదలలేదు. త్రాఁచు పడగ విప్పినది. మిలమిల మను నా పడగకాంతికి రజని కన్నులు నులుము కొన్నది. అప్పుడాప్రదేశ మంతయు మెఱపు మెఱసినట్లె యాత్రాచుఁపడగ కాంతులతోఁ దళుక్కు మన్నది. రాయలు-చేతులను జోడించి త్రాఁచునకు నమస్కరించినాఁడు. అంత నది దక్షిణదిక్కుగాఁ బ్రాఁకిపోయినది. రాయలు రజనిని గూర్చుండఁబెట్టెను. ఆమె కింకను భయము తీరలేదు.

కొమ్మలసందునుండి గంధపు మ్రాఁకుపై వెన్నెల స్వచ్ఛముగాఁ బడుచున్నది. రాయలు తన మొలనున్న

చాకును వెలికిఁ దీసి యాగంధపు వ్రూనిపై గొలుసుకట్టు వ్రాతలో ముద్దువచ్చు నక్షరములతో లోఁతుగా రజని పేరు చెక్కి, చాకును రజనికిచ్చినాఁడు. వానియభిప్రాయము నుగ్రహించి రాయలు చెక్కిన యక్షరములపై నవి చెడిపోకుండ రాయల పేరుకూడఁ జెక్కినది-" రజనీ! మన యిరువురివలెనే యున్నది సుమా యీలిపి " అని రాయ లనెను. రజని మందహాసము కావించినది. అంతలో సిగ్గుపడినది. ఆ సిగ్గుపడుటలో నాపె శరీర మంతయును గదలిపోయి యొక మనోహరమూర్తిని బ్రదర్శించినది. సంతోషమున రాయ లాపెచెక్కిలిపై వ్రేలితో మీటినాఁడు. ఒక్కసారిగా నాపె యొడలు పులకరించినది. రాయల కావిషయము తెలియును. తాముచెక్కిన పేరులవలెనే తమప్రేమకూడ స్థిరముగా నుండవలెనని వారిరువురును మన స్సులలోఁ గోరుకొని వెనుదిరిగినారు. మరల నాత్రాఁచు వచ్చి యక్షరములున్నస్థలమును జుట్టుకొనినది. చప్పుడువిని యిరు వురును వెనుకకుఁ జూచిరి.

"మనప్రేమ స్థిరముగానుండుట కీత్రాఁచుపూఁటకాఁపు" అన్నది రజని యప్రయత్నముగా - " చంద్రుఁడు మధ్యవర్తి" అని రాయ లాకసమువంక చూపించెను. అప్పుడే కోయిల యొకటి మామిడి తోఁపులోనుండి " తథా " స్తనునట్లుగఁ గూసినది. " అది మన మిత్రము " అని రజని యావాక్యమును బూర్తిచేసెను. తిరిగి నావనెక్కి వారిరువురును బూర్వస్థలము నకు వచ్చి సౌధమునకుదారితీసినారు. శయనాగారమును బ్రవే

శింపకయే వస్త్రములను మార్చుకొనుటకై రజని వెడలినది. ఆవిశాలమైన పడకగదిలో రాయలొక్కఁడే కూర్చుండెను. మిలమిలమను శరీరకాంతులతో నా తెల్లత్రాఁచు ఇంకను వాని కన్నులకుఁ గట్టినట్టున్నది. తెల్లత్రాఁచును జూచుట తనకదే ప్రథమము. గంధపుఁదోఁపులో నొక గొప్ప త్రాఁచు తిరుగు చున్నదని పాలేరులు చెప్పుచుండెడివారు. నాఁటిరాత్రి యనా లోచితముగాఁ దామచ్చటికిఁ బోవుటచే నాకస్మికముగా నది కంటఁ బడినది. ఆ త్రాఁచా గంధపుమ్రాఁకును జుట్టుకొని యుట్లెల యుండెనో రాయ లూహింపఁజాలఁ డయ్యెను. నీటి జలపడిన స్థలమునుండి యొక తెల్లత్రాఁచు ఎచ్చటికో వెడలి పోయెనని యతఁడు వినియుండెను. అదికాదుకదా యిది !...

అత్రాఁచునకుఁ దమకు నేదియో చెప్పలేని సంబంధ మున్నట్లాతఁ డెంచినాఁడు. లేనిచో వెడలిపోయిన త్రాఁచు మరలివచ్చి తాము పేళ్ళు చెక్కినచోటునుగప్పిపరుండుటయేమి! అసలు తెల్లత్రాఁచు లెవ్వరికిఁ గంటఁబడవు. పడెనా నిముసములో మాయమైపోవును. అట్లు కాదేయిది !... రాయలు మంచము నుండి దిగి గదిలో నున్న దీపముల నార్పివేసినాఁడు. తూరుపు గవాక్షమునుండి చంద్రకిరణములు గదిలోఁ బడుచున్నవి. దానినిగూడ నాతఁడు మూసివేసెను. గది యంతటను జిమ్మ చీఁకటి యావరించినది. రజనీకుమారి గులాబిరంగు చీరను ధరించివచ్చి గదిమధ్య నిలిచెను. రాయలు తటాలునఁ దూరపు గవాక్షముకైమీదనున్న యొకదీపమును వెలిగించినాఁడు. ఆగది

యంతయును బాలరాతిగచ్చు చేయఁబడినది. సరిగా గది మధ్యను రజని పాదములక్రింద సహస్రదళ కమలము చెక్కఁ బడినది. ఆ సమయమున నుదయ సంధ్యావేళ కమలజాతయైన లక్ష్మీదేవివోలె రజనీకుమారి వెలుఁగొందెను. రాయలావృశ్య మునుగాంచి తన్మయుఁడైనాఁడు. రజనీకుమారి రత్నకంబళ ముపై నాసీనయై వీణాతంత్రులను మీటినది. తక్కిన మూఁడు వైపులనున్న దీపములుగూడ వెలిగించి రాయలుకూర్చుండెను.

రజనీకుమారి యంగుళులు వీణెయపై నాట్య మాడ సాఁగినవి. ఆమె కంతకంతకు నుత్సాహ మతిశయించుచున్నది. ఆమెకొడలు తెలియుటలేదు. తక్కిన ప్రపంచ మసలే తెలి యుటలేదు. ఆమెకుఁ దెలిసినవి రెండే! ఒకటి, చేతిలోని వీణె; రెండు, ఎదురుగానున్న మనోనాథుఁడు. రాయలు పరవశుఁడై గాన మాలకించుచుండెను. బయటి ప్రపంచమంతయుఁ గూడ నిశ్శబ్దత వహించినది. ఆపె గాత్రము తిరిగినన్ని మెలికలు వీణకూడ నందుకొనలేక పోవుచున్నది. రజనీకుమారి యీావఱ కెన్నడును నంతబాగుగా వీణను వాయించి యుండలేదు. అంత బాగుగాఁ బాడియుండలేదు. నేఁడేలొకో యామెలో దాఁగి యున్న కళావైదగ్ధ్యమంతయు నొక్కసారిగా నుబికి వచ్చినది. రజనీకుమారిపాట పూర్తియైనది. ఆపె వ్రేళులు నాఁగిపోయినవి. కాని వీణ యింకను మ్రోగుచునే యున్నది. దానితోఁబాటు సౌధ మింకను శబ్దించుచునే యున్నది. సౌధపరిసరము లన్ని యును రాగాలాపనము నింకను బ్రతిధ్వనించుచునే యున్నవి.

రజని వీణియను గ్రిందఁ బెట్టివేసినది. రాయలు వచ్చి యామె చేతిని బట్టుకొని తూర్పు గవాక్షమునొద్దకు నడిచెను. ఇరువురు గవాక్షమునుండి యుద్యానవనములోనికిఁ జూచిరి.

మసక వెన్నెలతో నుద్యానవనమంతయును బ్రశాంతముగా నున్నది. మందముగా గోదావరి నీటి యలలధ్వని యొకించుక వినఁబడుచుండెను. గాలివిసురుల కెందుటాకులు గలగల మనుచున్నవి. గవాక్షమునుండి యనతిదూరములోఁ గన్పడుచున్న మందారములు నాగస్వరమునకుఁ దలయూచు నాగసులవలె భృంగముల మ్రోతలకుఁ గదలాడుచున్నవి. కృత్రిక సరస్సులోని నల్లఁగలువలు పూర్తిగా వికసించి చంద్రునకు నివాళింపు లిడుచున్నవి. ఒక గాలిపాటునకు దక్షిణగవాక్షమునుండివచ్చిన పువ్వువెలగయొక్క సౌరభము వారి నుక్కిరిబిక్కిరి చేసినది. ఆగాలిపాటునకు రజని రెండుచేతులు మొగమునకడ్డు పెట్టుకొనెను. ఆమె చేతి కంకణములు గలగలలాడినవి. మామిడితోఁపులోనుండి క్రొత్తగా జతకట్టిన కోయిల జహాంగీరు చిగుళ్ళవిందు నారగించి యానందపారవశ్యమునఁ బంచమరాగమును విసరెను. మేడక్రిందుగా నింకను బచ్చికఁగొఱుకుచున్న పెంపుడు లేడి యా కూతకు నదరిపడినది. అప్రయత్నముగా రజనీకుమారి యా కూఁత చివర నందుకొన్నది. కోయిల మఱి పాడలేదు. రాయలన్నాఁడు –

" రజనీ! నీవు సంగీతకళాధిదేవతవు...నా ఆరాధ్యదేవతవు... " అని. రజని యన్నది –

"నాథా! మీరలుమహాకవులు. నేనెంతటిదానను?..." అని. రాయలు మందహాసము చేసెను...చంద్రుఁడు గవాక్షమును దాఁటిపోయినాఁడు.

# 8

రజనీకుమారికి గాఁపురమునకువచ్చిన నాల్గుసంవత్సరములకుఁ గొడుకు పుట్టెను. బాలుని జూచుటకుఁ జుట్టాలందఱును వచ్చిరి. కాని భారతీసంరక్షణనిమగ్నయైన భవాని పుట్టింటికిఁ బోలేదు. రామయ్యగారి కుటుంబమునకు భవాని పరిస్థితు లింత వఱకును దెలియవు. రామయ్యగారు పిలుపు తక్కువైన దేమో యని యనుమానపడిరి. చెల్లెలిని దీసికొని వెళ్ళుటకుఁ గేశవుఁడు రామగిరికి వచ్చెను. కేశవునికి బావగారి దర్శనమే యైనది కాదు. భారతి కేశవునియొద్దకుఁ జనవుగా వచ్చినది. అప్పటి కామెకు నాల్గుసంవత్సరముల వయస్సు. కేశవుని జూపి 'మామయ్య' అని భవాని చెప్పినది. "మా మ య్య" అని కూడబలుకుకొని భారతి పకపక నవ్వెను.

"భవానీ! మనయూరి గోపూజోత్సవములును, బారసాలయును గలసివచ్చినవి. నీవుతప్పక రావలెను. నీవురానిచో నమ్మ బెంగపెట్టుకొనును"— "చిన్నన్నా! నన్ను మన్నింపఁగోరుచున్నానని అమ్మతోఁ జెప్పుము. నేను రాఁజాలను. ఇచ్చటి పరిస్థితులు బాగుండలేదు."— భవాని కంఠము రుద్ధమయ్యెను. కేశవుఁ డింక బలవంత పెట్టలేదు. భవానిహృదయములో నేదో

బాధ యిమిడియున్న దని యాతఁడు గ్రహించినాఁడు. ఆమె చిఱునవ్వు నవ్వినను విషాద రేఖలు వెనుక మసకలాడుచునే యున్నవి. దీనిని గుర్తించిన కేశవుఁడు పరిస్థితులను దెలిసికొన నెంత ప్రయత్నించినను భవాని వెలితిపడినది కాదు. ఆమఱు నాఁడే కుమార దేవమున గోష్ఠాజోత్సవములు ప్రారంభమగును గాన కేశవుఁ డారాత్రియే ప్రయాణ మయ్యెను. భారతి మామయ్యకు వీడ్కోలొసంగినది.

పదునొకండవరోజున భవాని రాకపోవుటచే నైదవ నెలలో బారసాల ముహూర్తము నిర్ణయింపఁబడినది. నాఁటి కైనను భవానిని దీసికొనిరావలెనని కేశవుఁడు స్వయముగా వచ్చినను నిరాశయే యైనది. అన్నకుమారుని బారసాలను దాను జూడఁ బోఁజాలనందులకు భవాని చాల విచారించెను. తా నిప్పుడు కుమార దేవము వెళ్ళినచో నన్నయును, అమ్మయును మిక్కిలిగా సంతసింతురు. నిజముగ వెళ్ళినచో నిక్కడ పరిస్థితులు విషమించునేమో ?

ఇప్పటికే భర్తనున్నగాని, భారతినిగాని చూచుటలేదు. తాను వెళ్ళివత్తునని చెప్పుటకైనను దర్శన మిచ్చు ననునాశ లేదు. చెప్పకుండ వెళ్ళుట ధర్మముకాదు. ఒకవేళ సాహసించి వెళ్ళినచోఁ దప్పక నాగ్రహపడును. ఆ యాగ్రహమున కసలు తట్టుకొనుట కష్టమగునేమో ? ... భారతి తల్లి లేని పిల్ల; పైగాఁ దండ్రిచేఁ దిరస్కృత. అట్టి బాలికను దన వెంటఁ బెట్టుకొని త్రిప్పినప్పు డెవ రేమాట యాడుకొన్నను భారతి

లేతమనస్సు కలఁతనొంది పోవును. ఆమెకుఁ బూర్తిగా నూహ వచ్చువఱకుఁ బరిస్థితులెట్టివియు నామెకుఁదెలియనీరాదు. చివర కామె పుట్టింటికిఁ బోరాదనియే కృతనిశ్చయురా లయ్యెను.— "అమ్మా! మామయ్యతో వెడితేయేం?" అని భారతి ప్రశ్నించెను. "నీకుఁ దెలియదమ్మా? మన మింకొకసారి వెళ్ళుదమంతే" — ఇప్పుడు మామయ్యతో నెందులకు వెళ్ళరాదో భారతి యూహింపలేకపోయినది.—"ఏమి? మామయ్య మంచి వాఁడు కాదా, అమ్మా!" అని భారతి యమాయకముగా నడిగెను. భవానికి నవ్వువచ్చినది.

భవాని యెంతహృదయోద్వేగముతోనున్నను భారతి యొక్క యీ జిలిబిలిపలుకులే ఆమె హృదయమును దేలిక పఱచుచుండెను. భవాని కింకొక యుబుసుపోక భారతికిఁ జదువు చెప్పుట. చక్కని కాలము నామె గ్రంథపఠనమునకును, నూలు వడుకుటకును వినియోగించును.

భవాని రాలేదని యీశ్వరమ్మగారు చాల ఖేదపడిరి. "ఒకరిచేతులలోఁ బెట్టినతరువాత మనయిష్టమేమున్న" దని రామయ్యగారు మనస్సును సరిపెట్టుకొనినారు. భవాని రాలేదని విని రాయలు గదిలో నట్టులే కూర్చుండిపోయెను. కొంత సేపటికి రజనీకుమారి మేడమీఁదికివచ్చినది. "పాపము! భవాని మనస్సులో నేదో బాధపడుచున్నట్లున్నదని కేశవమూర్తి చెప్పుచున్నాఁడు." అని రజని యనెను. — "అవును. అల్లారు ముద్దుగాఁ బెరిగిన భవాని..." రాయలకంఠముగద్గదికఁ జెందెను.

ఆతఁడిక మాటాడలేకపోయెను. ప్రసంగమును మార్చివేయుట మంచిదని రజని యూహించెను. "ఇప్పుడు రానిచో నింకొక సారి వదినె కప్పకవచ్చును. మీరిట్లు కూర్చున్నచో నెట్లు... లెండు..."అని రజని రాయలచేతులను బట్టుకొనెను. రాయలు రజని కన్నులలోనికిఁ జూచినాఁడు. ఆమెకిప్పుడు నూాత్మస్థానము వచ్చినది. ముఖములో శాంతియేకాని చిన్ననాఁటి చిలిపితనము మచ్చునకైన గోచరించుటలేదు. రాయలాపె దృక్ప్రసారములచే నాకర్షింపఁబడి, పనులు చూచుకొనుటకై యూవలికి వెళ్ళెను.

బారసాల పండుగడు వైభవముతో జరిగినది. బారసాలకుఁ జంద్ర పుట్టింటివారుకూడ వచ్చిరి. రాయలు కుమారునికి విజయుఁడనునామము వ్రాసెను. కాని విజయుని జాతకమును బరిశీలించినంతనే విశ్వనాథుని మనస్సులలో చివుక్కు-రుమన్నది. దీనిసెవ్వరును గమనింపలేదు. అయినను బాలారిష్టములుతొలఁగి బాలుఁడు దీర్ఘాయుష్మంతుఁడగు సూచనలుండుటచే నందులకు వలయు హోమాదికములు నాదిననుననే విశ్వనాథుఁడు రాయలచేఁ జేయించెను. గోపూజోత్సవములు ముగియువఱకు నుండుఁడని రామయ్యగారు బంధువులను గోరుటచే వారందఱంగీకరించి యంతవఱకక్కటనే యుండిపోయిరి.

కుమారదేవమునఁ బ్రతిసంవత్సరమును గోపూజోత్సవములు గొప్ప తిరునాళ్ళవలె జరుగుచుండును. శిశిర ర్తువునందు రైతుజనమునకుఁ బంటలనందడితగ్గి తీరికయైనంతనే యీయుత్సవములు ప్రారంభమగును. ప్రథమదినసమం దుదయమే ప్రతి

రైతును దనశ్రేష్ఠమైన యావుల నాలయమండపముకడకుఁ గొనివచ్చును. అటఁ గేశవుఁడు చంద్రాద్వితీయుఁడై తనపడమటావును యథాశాస్త్రముగాఁ దోలుతఁ బూజించును. రైతులందఱు వాని ననుసరింతురు. తరువాతగోవులతో నూరేఁగెదరు. ఆ మధ్యాహ్నము పండితులచే గోవర్ధనోద్ధరణము కథగాఁజెప్పబడును. రాత్రివేళ నదే నాటకమాడఁబడును. ఆ కాలమున సంజీవపురము మొఖాసాలోని భాగవతులు ప్రదర్శనములందు గొప్ప పేరు వహించి యున్నారు. గోవర్ధనోద్ధరణము మొదలైన కృష్ణలీలలను బ్రదర్శించుటలో వారికిఁ బెట్టినదిపేరు. ఈ భాగవతులందఱకును బ్రతిసంవత్సరము మామూళ్ళున్నవి.

మఱునాఁడు గృహాపరిశ్రమలు ప్రదర్శింపఁబడును. మూఁడవరోజునఁ బేదల కన్నవస్త్రదానములు జరుగును. ఆ ఖర్చంతయును రామయ్యగారొక్కరే భరింతురు. నాల్గవరోజున యమున లలితకళలందుఁ బోటీలు జరుగును. పోటీలలో నెగ్గిన వారికి బహుమతులిత్తురు. ఆ నాఁటి సాయంకాలమున గాన సభలు జరుగును. ఆ గానసభలను దిలకించుటకుఁ గ్రిందటియేఁడు మాత్రమే విశ్వనాథుఁడు వచ్చినాఁడు. అప్పుడాసభలలో రజనీకుమారియును బాల్గొన్నది ఐదవరోజురాత్రితో నుత్సవములు పూర్తియగును

ఆ యైదవరోజు సాయంకాలమున నిజముగఁ గుమారదేవము గోవర్ధనోద్ధరణోత్సవమునాఁటి బృందావనమును మించి యుండును. స్త్రీపురుషు లాబాలగోపాలము నుత్సవమునఁ

బొల్గొందురు. సంజీవపురభాగవతులలో రంగన్న యను బాలుడు కృష్ణవేషము వేయును. ఏ పూర్వపుణ్యముననో వాని కా చిన్నవయసునందే వేణుగాన మత్యద్భుతముగాఁ బట్టుబడినది. కుమారదేవపు దేవదాసీకన్యలు గోపికలయ్యెదరు. సంజీవపురపుభాగవతులు గోపాలక వేషములు వేసెదరు. కృష్ణస్వరూపధ్యానములచే నిష్కళంకములైన వారి హృదయ ములతో నెకిసలాడుచుండును. సాయంతనమగుసరికి నుత్సవము కూడును. ఆ రాత్రి కృష్ణలీలలను బూర్తిగా నటించుదురు.

దేవదాసీకన్యలలోఁ బుష్పలతయనునామె రాధికావేష మును ధరించును. పుష్పలత తనజీవితమును కృష్ణదేవున కంకి తము చేసికొన్న సార్థకాఖ్యయగు దేవదాసి! ఆజన్మబ్రహ్మ చారిణి. నెమలిపింఛ మల్లలనాడుచుండ, వేణువు ధగద్ధగ కాంతుల నీనుచుండ, రంగన్న గోపాలకృష్ణుఁడై యామెను వహాతపా లాడఁజేయును. సంతత కృష్ణధ్యాననిరత యగుటచే నిజముగఁ గృష్ణుఁడే యన్న పారవశ్యమునఁ బుష్పలత రాధికా కృతిని జెందును. ఆ రాధిక కృష్ణభక్తి, ఆకృష్ణుని మధుర వేణు నాదము, ఆ యిరువురి మనోహరభాషణములు కుమారదేవ వాసుల నేలోకములకో కొంపోవుచుండును.

ఈ ప్రదర్శనములతో గోపూజోత్సవములు ముగియును. జయేశ్వరాధీశు లీ ప్రదర్శనము నతిశ్రద్ధతోఁ బరిశీలించి ముగ్ధులై పుష్పలతకు బంగారుకృష్ణ విగ్రహమును, రంగన్నకు మూల్యమైన వేణువును జేయించి యిచ్చిరి.

గోప్రాజోత్సవములు ముగిసిన నాఁటిరాత్రి తెల్లవాఱు జామున బంధువులందఱును ప్రయాణమై వెళ్ళిరి. వారము రోజులనుండియుఁ జాల సందడిగానున్న మాధవీమందిర మొక్కసారిగా బావురుమనిపోయినది కాని యింటిలో విజయుని సందడి యెక్కువైనది. రజనీకుమారి కాతఁడు లొంగెడివాఁడు కాఁడు. కాని "కన్నయ్యా" యనుచుఁ జంద్ర యెత్తుకొని నంతనే కేరింతాలు కొట్టుచు నతఁడాడుకొనును. విజయునికిఁ దిక్కవచ్చినచోఁ జంద్రయే లాలింపవలెను. తాను దన కన్న కొడుకును లాలింపఁ జాలనందులకు రజనీకుమారి చాల ఖేద పడెడిది. తనకుఁగల లోపమేమో తెలిసినదికాదు. తిక్క తిరిగిన తరువాత విజయుఁడు రజనియొడిలోఁగూడ కొంతసే పాడు కొనును. రజనీకుమారి యందులకే మహానందమందెడిది క్రమ ముగా విజయుఁడు కేశవునికిఁగూడ నెక్కువ యలవాటయ్యెను. రాయ లప్పుడప్పుడు కుమారుని బల్కరించుచుండును. కాని యలవాటు మాత్రము చేసికొనలేదు. ఇఁక నీశ్వరమ్మగారును రామయ్యగారును ముద్దులు మూటగట్టు మనుమని జూచుకొని మురిసిపోవుచుండెడివారు.

## 9

ఏఁడాది తిరగకుండఁగనే విజయునకుఁ జాల జబ్బు చేసి నది. బ్రతుకుట కష్టమనుకొనిరి. దైవకృపవలన నా గండము గడిచినది. కాని రోగ చిహ్నములు కంఠమును బట్టుకొన్నవి. ఆతఁడు మూగవాఁడయ్యెను. ఏండ్లుమీరినను మాటలు రాలేదు.

విజయుని జబ్బులో రాయలు వానిమంచము నే కనిపెట్టుకొని యుండెడివాఁడు. అందుచే నాతఁడు పుస్తకము తెరచినచో పుస్తకమునందుఁ గృశించిపోయిన విజయుఁడే వానికిఁ బ్రత్యక్ష మయ్యెడివాఁడు. అందఱికి పురూపుఁడైన బాలుఁ డిట్లయినాఁ డేమి? — పుత్రుని క్షేమమునకై రాయలు పరితపించిపోయెను. రజనీకుమారి యంతకన్నను మథనపడినది. రాత్రు లందఱును బరున్నను విజయుని కేమి కావలసివచ్చునో యని యామె మేల్కొనియే యుండును. తోడికోడలి యవస్థకుఁ జంద్ర మనస్సు కరిగిపోయెడిది. రజనిని బతిమాలి యొక ప్రశాంత స్థలములో నామెను నిద్రపుచ్చి చంద్ర తాను విజయుని కుపచారములు చేయుచుండును. కాని యాందోళితహృదయ యగు రజనీకుమారికి మాగన్నైనఁ బట్టెడిదికాదు. కేశవుఁడు పట్టి 'బేలమనిషి'. అన్నకు ధైర్యము చెప్పఁజాలఁడు అన లన్నగారితో నెట్లు మాటాడవలయునో వానికిఁ దెలియనే తెలియదు. ఈశ్వరమ్మగారు, రామయ్యగారు నీ బాధను లోలోననే యణఁచుకొనియుండిరి.

క్రమముగా విజయుఁ డారోగ్యమును బొందెను. విశ్వ నాథుఁడు రక్షరేకును బంపించినాఁడు. జబ్బు మళ్ళు మొగము పట్టినంతనే విజయుడు నడువ నారంభించెను. విజయుఁ డారోగ్య మును బొందుసరికి నాందోళితమనస్కయగు రజని మంచ మెక్కెను. బలహీనతచేత నామె మంచమునుండి లేవలేని స్థితికిఁ గూడ వచ్చినది. విజయేశ్వరమునుండి రామమోహ

నులు సంస్థానవైద్యుని దీసికొని వచ్చినారు. ఆయన చాల మెలఁకువతో మందు నడిపెను. చంద్రకు రజనికుపచారములు చేయుటతో సరిపోయినది. కేశవునికి వ్యవసాయపుఁ బనులు వచ్చెను. అందువలన విజయుడు రాయలకు జనవయ్యెను. సంతోషముగఁ దండ్రి యొడిలో నాడుకొనెడివాడు. రజనీకుమారి క్రమముగా నారోగ్యమును బొందెను. కాని యామెపూర్తిగా కోలుకొనునప్పటి కాఱు నెలలు పట్టినది. రజనీకుమారి యనారోగ్యసమయములో విజయునికి మేఁకపాలొసంగెడువారు. అది త్రాగి విజయుఁడు మిక్కిలి బలిష్ఠుఁడైనాఁడు.

కుమారుని జబ్బునసమయములోను, ఆవెనుక భార్యకుఁ దీవ్రమగు ననారోగ్యము కల్గినప్పుడును రాయల హృదయము చలించిపోయినది. ఇంతవరకు నాచార్యుని బోధనలను మఱచిపోయిన వారివలె తా మిరువురు నైదేండ్లు గడిపివేసిరి. తమ జీవిత కార్యక్రమ మెట్టిదో వారు నిర్ణయించుకొనలేదు. కళల పునరుద్ధరణకై జీవితమును ధారవోయుదుమని శపథమును జేసిరేకాని యామార్గమేదో వారూహింపలేదు. చివరకు జీవితములోఁ దా మేమియును జేయలేమేమో యన్న భయము రాయలకుఁ గల్గినది. తమకేమి కావలసివచ్చినను జంద్రా కేశవు లిరువురు నిముసములో సమకూర్చుచుందురు. వీరిరువురి పరిచర్యలతోడను వారిరువురును మాధవీమందిరమందలి దైనందిన కృత్యములలో నైనను భాగస్వాములు కాలేకపోయినారు. తమజీవితము లిట్లు నిరర్థకముగఁ గడచి పోవలసినదే యగునా

యని మఱింత విషాదమును బొందిరి. ఈ మనోవేదనతో రాయలు భవానీపరిస్థితులనుగూర్చి యాలోచింపనే లేక పోయినాఁడు. చంద్రాకేశవులకు వారిబాధ యర్థము కాలేదు.

విజయునికి నాల్గవయేఁడు వచ్చినది. కాని వానికి మాటలు రాలేదు. "ఈబాలుఁడు నాజీవితపు నిరర్థకతా చిహ్నమా ?" యని రాయలు మఱియును దిగులుపొందెను. కాని మాటలురాని యమాయకుఁడని వాని నందఱును ప్రేమతోఁ జూడసాఁగిరి. అందువలన విజయుఁడు క్రమముగా బండఁబారినాఁడు. వానిప్రకృతి చాలఁ జిత్రమైనది. మూఁగతన మైనను చెవుడైనంతయును లేదు. అతఁడే పనియైనఁ దనకుఁ దోఁచినట్లుమాత్రమే చేయుచుండును. ఒక్కొక్కసారి యాలోచనా నిమగ్నుఁడై యొక్కచోధ్యానసుస్థిరుఁడైన యోగివలెఁ బద్మాసనమువేసి కూర్చుండును. అందులకుఁదోడు 'ఓం' కారము ననుకరించుధ్వనిని గుక్కవిడువకుండఁజాలసేపు వెల్వారించెడివాఁడు. దానియర్థమేమో యెఱుంగరాదు. నాల్గవయేఁడు వచ్చినప్పటినుండియునాతఁడుప్రత్యూదయమునుదండ్రితోఁ బాటు గోదావరినదిలోస్నానముచేసి వచ్చెడివాఁడు. స్నానమాచరింపకుండగ నేవస్తువును ముట్టఁడు. తండ్రిసరసను గూర్చుండి నిష్ఠానియమములు కలవానివలె భుజించును. తండ్రి యూరిలో లేనప్పుడు యథావిధిగా జరుగవలసిన వానిలోఁ బొరపాటున నేమిలోటు వచ్చినను అతఁ డల్లరి చేసివేయును. అప్పుడు తాతగారు వచ్చి వానిని లాలించి యన్నము తినుపించుచుందురు.

నాలుగేండ్లు దాటినప్పటి నుండియు విజయుఁ డప్పు డప్పుడు కేశవునితోఁ బొలములకు వెళ్ళసాఁగెను. చంద్రకూడ 'కన్నయ్యా!' యనుచు విజయుని గడు గారాబము చేయు చుండును. విజయుఁడు పొడవరి. పినతల్లి వడికిన నూలుతో నేయఁబడిన చలువ బట్టలను గట్టి యాతఁడు నడచు చున్నచో నాతీవి మహారాజపుత్రుల సంస్కారములోఁ గూడ నుండదేమో యనిపించును. అతఁడు చరచర నడచుచోఁ గేశవుఁడుకూడ వాని ననుసరింప లేకపోయెడివాఁడు. క్రొత్తగాఁ బుట్టిన పడమ టావుదూడకును హరిణశాబకమునకును విజయుఁడు చెలిమి చేసినాఁడు. ఆ రెండును వాని ప్రాణమిత్రము లైనవి. విజయుని మూఁగభాషకు, నాజంతువుల సంకేతభాషకును సరిపోయెను గాఁబోలు.

రామగిరిలో భవాని భర్తయింటఁ గాపురముంచి యెనిమి దేండ్లయినది. ఆనాఁడు కోపమున నంతఃపురమునుండి వెడలి పోయిన గిరిరా వింతవఱకును దిరిగి భవానివంకఁ జూడనేలేదు. ఎన్నఁటికైన నతని మనస్సు త్రిప్పుకొనునేమో యని భవాని వేచి యుండెను. ఆయాశయే లేకపోయినది. ఈ యెనిమిదేండ్ల లోను భవాని పుట్టింటికైన నరుగలేదు. ఆమెకు లోకము సవతి బిడ్డ భారతియే. భారతికిఁ గన్నతల్లి లేచిలోటు కన్పింపలేదు. భవాని తనకన్నతల్లి కాదని యామె యెఱుంగదు. భారతికిఁ దానే యక్షరాభ్యాస మొనర్చి భవాని తా నన్నకడ నేర్చిన దంతయును భారతికిఁ గ్రమముగాఁ జెప్పసాఁగెను. బుద్ధిసూక్ష్మత

కల భారతియు భవాని చెప్పెడి సర్వమును గ్రహించుచుండెను. భారతి మెల్ల మెల్లగా నింటిపరిస్థితుల నవగాహనము చేసికొనఁ బ్రయత్నించెను. కాని యా యమాయికహృదయమునకు మొదట నేమియును తెలిసినదికాదు.

ప్రత్యుదయమును నిత్యకృత్యములను నిర్వర్తింపఁజేసి భవాని భారతిచే నాపె తల్లిపటమునకు నమస్కారమును జేయించును. ఇదేలకో చాలకాలమువఱకు భారతి యూహింపలేకపోయెను. భారతి తల్లిపటమునకు నమస్కరించునపుడు— "అక్కా! నీవు నిర్మలముగ నుండు" మని నిమీలితనేత్రయై భవాని మనస్సులో ననుకొనుచుండును. భారతి తల్లియొక్క కోరికలలో నొక్కటిమాత్రము ఫలించినది — ఆపె బిడ్డ పెరిగి పెద్దదయినది. కాని భర్తమాత్రము యథాప్రకారముగనే యుండెను. వాని వ్యవహార మింకను మితిమీఱినదేకాని యేమాత్రమును తగ్గలేదు. అట్లగుట కొకవిధముగాఁ దానే బాధ్యురాలేమో!...... ఒకనాఁడు భారతి తల్లి పటమునకు నమస్కరించుచున్నప్పుడు భవాని కీవిషయములు మెఱుపువలె తలంపునకు వచ్చెను. ఇంతవఱకును లోలోపల నణఁచుకొనుచున్న దుఃఖ మాఁగినదికాదు. ఆమె కనుల నీరు నిండినది. భవానిని జూచి భారతి చకితయయ్యెను. తల్లి కాన్పు కన్నీటిని జూచినంతనే యామెకును దుఃఖము వచ్చినది. భవాని తన దుఃఖమును దిగమ్రింగి భారతి కంటినీరు తుడిచెను.

"అమ్మా! నీవేడ్చుటకుఁగారణమే" మని భారతి యడిగెను. ఆమె చెప్పలేకపోయినది. భారతిహృదయము తల్లడిల్లెను.

ఆ సాయంకాలమే భారతి తన్ను బెంచిన వృద్ధపరిచారికను దఱచి తఱచి యడిగి సర్వము నెఱింగినది. మఱునాఁడు తల్లి పటమునకు నమస్కరించు సమయమున "ముందుగా నీకే నమస్కరింతు" నని భారతి భవానితోనన్నది. భవాని కారణ మడిగెను. భారతి తాను దెలిసికొన్న విషయమును జెప్పెను.— "నీవు నాకన్నతల్లివి కాకపోయినను, నిన్ను నేను కన్నతల్లి కంటె నెక్కుడుగాఁ దలంచుచున్నాను." అని భారతి యెంతో యనుభవజ్ఞురాలివలె వినమ్రమై పలికెను. భవాని కన్నులనుండి యానందాశ్రువులు రాలినవి. — "అమ్మా! ఆమె నిన్ను కన్న తల్లి. కన్నతల్లికంటెఁ బూజనీయులు వేఱు లేరు. కన్నతల్లి హృదయమును నీ వింకను గ్రహింపఁజాలవు......"— భవాని యిఁక మాటాడలేకపోయెను. భారతి మాటాడక తల్లి పటము నకు నమస్కరించినది.

ఇంతవఱకును గన్పించని తండ్రిని ఆనాఁడు చూడవలెనని భారతి గట్టిగా సంకల్పించుకొనెను. భవానియు నంగీకరించెను. ఆటుఁ బోటులకుఁ దట్టుకొనుజ్ఞానము భారతికి వచ్చినదని భవాని గ్రహించినది. గిరిరావుబాబు తనశయనాగారమందొక విలాసిని పానీయముల నందిచ్చుచుండఁ ద్రావుచు మత్తులో నున్నాఁడు. భారతియు, భవానియును ముసలిదాది దారిచూపింప గిరిరావు పడుకగదిలోఁ బ్రవేశించిరి. ఆ గదియంతయును మధురవాసన లతో నిండియుండి మైకమును గల్గించుచుండెను. ఆ గదిలో నడుగు పెట్టినంతనే భవాని యొడలు జలదరించెను. — ఇంత

కాలమునుండియు లేనిది నేఁ డిట్లు రాణిగారు జమీందారుగారు నొద్దకుఁ బోవుచుండుటనుజూచి యంతఃపురమంతయు నాశ్చర్య నిమగ్నమైనది. భారతియు, భవానియు గదిలోఁ బ్రవేశించి వారికిఁ గనఁబడునట్లు ప్రక్కగానొదిగి నిల్చిరి.

"ఎవరు నీవు ?" అని గిరిరా వాయాసముతో నస్పష్ట ముగాఁ బ్రశ్నించెను. "నేను భవానిని స్వామీ!" అని భవాని ప్రత్యుత్తరమిచ్చినది. మత్తుచే నసలే కనరాకున్న తన రెండుకను లను గిరిరావుబాబు తన రెండుచేతులతోడను గట్టిగా మూసి కొని — "ఇక్కడ నీకేమిపని ? వెడలిపొమ్ము" అని యఱచెను.

"మహారాజా ! ఈమె మీపుత్రిక భారతి. మిమ్ముఁజూడ వలెనని కొండంతయాశతో వచ్చినది. ఈ బాలికకు మీతల్లిగారి పోలికలన్నియు వచ్చినవఁట. ఒక్కసారి యీమెను బ్రేమతోఁ బల్కరింపుడు...... మీయారోగ్యము చెడిపోయినది. ఈవిలా సినులను బంపించివేయుఁడు. నన్ను మీకు సేవ చేయనిండు" అని చేతులుజోడించి భవాని విన్నవించెను. భారతియర్థముకాని యా వేదనతో నాయిరువురినిజూచెను. వారిరాక ననహ్యించుకొనుచు వారిని గెంటివేయుటకై గిరిరావు — పరున్నవాడు — విసురుగా లేచెను. దుర్వ్యసనములతో శక్తిహీనుఁడై పోయిన గిరిరావుబా బాదూఁకుడునకుఁ దాళుకొనలేక వెనుకకు విఱుచుకొని పడి పోయినాఁడు. భవాని ముందుకుఱికి క్రిందఁబడకుండ భర్తనుబట్టు కొన్నది. విలాసినియు, దాదియుఁ జేయూతనిచ్చి గిరిరావు బాబును బండుకొనఁబెట్టిరి. దాది పరుగునఁబోయి చన్నీటిని

దెచ్చెను. ఆనీటిని భవాని భర్త మొగముపైఁ జిలుకరించి పైఁట చెఱఁగుతోఁ వీవసాఁగినది.

సేవకులొక్కయంగలోఁబోయి యాస్థానవైద్యులనుదీసి కొని వచ్చినారు. ఈలోపున మెల్ల మెల్లగావిలాసిని తనదారిని దాను బోయినది. అదిచూచి "ప్రభూ! జీవితములో మార్పున కిది తొలిఘట్టము. ఇకనైనను నా దేవునకు నారోగ్యమునిమ్ము" అని భవాని కన్నీటితోఁ కృష్ణప్రభువును స్మరించుకొన్నది — ఆస్థానవైద్యులు పేరుపొందిన భిషగ్వరులు. కాని గిరిరావు బాబు నధికారములో నాయన కాస్థానప్రవేశము లేకపోయెను. అయినను దన పూర్వులందఱును రామగిరి జమీందారుల యుప్పు తిని బ్రదికినవారగుటచేతను, దమ చిన్నరాణియొక్క సౌశీల్యము వినియుండుటచేతను వారు వెంటనే బయలుదేరి వచ్చిరి. భవాని వినయముతో నమస్కరించినది. "సుమంగలీ భవ" యని వారామెను దీవించి గిరిరావును బరీక్షించినారు.

"అమ్మా! బాబుగారి కిప్పుడు కొంచెము తీవ్రముగా నున్నను గొలఁదిరోజులలోఁ దేఱుకొందురు. వారి యారోగ్య మంతయును మీ పరిచర్యపై నాధారపడియున్నది." అని వైద్యులు చెప్పిరి. భవాని యా యాదేశమును శిరసా వహించినది. "అమ్మా! నేనుగూడ నాయనగారి సేవచేయుదు" నని భారతి తల్లితో ననెను. వైద్యులు చిఱునవ్వు నవ్విరి. "అట్లే చేయుదువుగానిలే తల్లీ!" అని భవాని యామె నుత్సాహపఱచెను.

గిరిరావుబాబు జబ్బుసమయములో భవాని పెత్తనము దానే వహించినది. మరల రామగిరి సంస్థానములో నూత్నశకము ప్రారంభమయ్యెను.

# 10

ఒకనాఁటి రాత్రి కుమారదేవములో మాధవీమందిర పార్శ్వభాగమునందు పుచ్చపూలవెన్నెలలోఁ గేశవునికై చంద్ర వేచియుండెను. నాఁడు దశమి. చంద్రబింబము పూర్ణత నందుచుండెను. రాత్రి మొదటిజాము దాఁటెను. కాని పాలేరుల సందడిలో మున్గియున్న కేశవుని కింటిధ్యాసయే లేదు. "చిన్నబాబుగా"రనుచుఁ బాలేరు లాతనిని వదలరు. కేశవుఁడు వారి వారి కుటుంబ పరిస్థితులను వినుచు నుచితములగు సలహాల నొసంగుచుండును. హేమంతము వెడలిపోయి శిశిరర్తువు వచ్చినది. నదీతీరస్థమగుటచేఁ గుమారదేవములో హేమంతమందే చలి హెచ్చుగానుండును. కాని యేలాగో రైతుజనము దానికి లెక్కచేయరు. అమావాస్యతో రైతులకుఁ బొలము పనులన్నియు నైపోయినవి. ఇఁక శిశిరర్తువంతయు వారికి సెలవుకాలము.

హేమంతమంతయును రైతులకుఁ దీరుబడిలేని కాలమని యే చెప్పవచ్చును. పొలముపనులలోనుండిపోయి యొక్కొక్కప్పుడు రైతులు రెండుమూఁడు రోజులపాటు గృహములకే రారు. పంటలనుగోసి కుప్పలు వేయుటలోను, వేసిన కుప్పలను

నూర్చుటలోను, నూర్చినధాన్యము నింటికిఁ జేర్చుటలోను రైతులు నలిగిపోవుచున్నను, వారానందముతోఁ జిందులాడు చునే యుందురు. సామాన్యులైన రైతులపనియే యిట్లుండ నింకఁ గేశవుని విషయము చెప్పవలసినదేమున్నది ? అతఁడు సావకాశముగా భుజించి యిప్పటికి రెండునెలలు కావచ్చినది. ఏదియో యొక వేళకువచ్చి యన్నమునుదిని వెన్వెంట నేపొలము వెళ్ళిపోయెడివాఁడు. రాత్రి చాలఁ బ్రొద్దుపోయినపిమ్మట నల సటతో నింటికిఁజేరును. చంద్రయొకనాఁడు వానికేదియోచెప్ప వలయు ననుకొన్నది. ఆమెమాటవిని తొందరగా వెళ్ళిపోవు చున్న కేశవుఁ డాగినాఁడు. ఇంతలో ముంగిటినుండి "చిన్న బాబుగా" రనుచుఁ గేకవినవచ్చినది. అనాఁ డొక క్రొత్త వరి కుప్పను బడఁగొట్టెడి ప్రయత్నములో నున్నారు. కేశవుని ధ్యానయంతియు నచేయున్నది. తన్నెవరోపిల్చుట నాలకించి, "వచ్చెద నుండు" మని చంద్రకుఁజెప్పి కేశవుఁ డదేపోక పోయి నాఁడు. అట్టివి యనేక సంఘటనలు చంద్ర కనుభవమే.

ఎట్టకేలకుఁ గేశవుఁడు పాలేరులనుసాగనంపి వచ్చినాఁడు. అప్పటికిఁ జంద్రయలసిపోయినది. విసువువచ్చినది. ఆవులింతలు రాసాఁగెను. కూర్చున్న తిన్నెపై నట్టులే యొడ్డిగిలఁబడెను. కేశవుఁడు శబ్దము కాకుండ వచ్చి చంద్ర చెక్కిలిపై వ్రేలితో మీటినాఁడు. చంద్ర యులికిపడిలేచినది. కేశవుని జూడఁగానే యామెకుఁ గోపము పోయి సిగ్గు వేసెను. ఆసిగ్గుతో నామె

క్రొత్తపెండ్లికుమార్తెవలె, నారి సారించిన వింటిబద్దవలె వంగి పోయెను.

చంద్ర తనసిగ్గునాపుకొని "ముందు భోజనమునకులెం" డని భర్తనుగోరెను. "చంద్రా! నేనింతసేపాలస్యముచేయుటకుఁ గారణమును నీకుఁ జెప్పనే లేదు.......గోపూజోత్సవములను పౌర్ణమి వెళ్ళినంతనే మొదలు పెట్టుటకు రైతు లందఱు నిశ్చయించినారు. ఆయైదురోజులును మనపాలేరులందఱకును సెలవు కావలయునఁట. ఏమందువు?" — గోపూజోత్సవము అనఁగనే చంద్రకు మితిలేని యానందము కలిగినది. కేశవుఁడు భోజనమునకు లేచెను. వానితోఁబాటు చంద్రయును లేచెను. ఇంటిలో నందరును నిద్రించుచుండిరి. చంద్రాకేశవు లిరువురు నొక్క సారే భుజించినారు.

మూఁడవజామమధ్యమునఁ బశుశాలనుండి పడమటావు వికృతముగ నఱచినది. కేశవుఁ డులికిపడి లేచినాఁడు. వాని హృదయములోఁ జేయివెట్టి కలఁచినట్లయ్యెను. అతఁడతివేగముగా గోశాలవైపు పరువెత్తెను. కేశవుఁడు గోశాలను జేరునప్పటి కొక తీతువుపిట్ట వేపకొమ్మపైఁ గూర్చుంచి "తీ, తీ" యని కూనిరాగము తీయుచుండెను. పడమటావు దానివంక దీక్షముగా జూచుచున్నది. ఆ ప్రదేశ మంతయును దుఃఖమావరించినట్లుండెను. చంద్రాస్తమయ మగుటచేఁ జీఁకట్లు పూర్తిగా నలముకొన్నవి.

కేశవుఁడు గోశాల యందలి దీపమును వెలిగించినాఁడు. ఆ వెలుంగునుజూచి తీతువు "తీ, తీ" యనుచునే యెగిరిపోయెను. పడమటావు కేశవుని గాంచి నిమ్మళించినది. దాని పెద్దదూడ యొకటివచ్చి కేశవుని జేతులను నాకినది. చిన్నదూడ కట్టుగట్టి నుండి యఱవసాఁగెను. కేశవుఁడు దాని త్రాటిని విప్పివేసి వచ్చి పడమటావు వీపును దట్టినాడు. ఆ యమాయికపు మూఁగ జంతువులు మూఁడును దమయజమానితో నేమేమో వలపోసి కొన్నవి. కేశవునికి వారిబాధ యర్థమైనది. ఆమాటితోఁ దానుగూడ నేకమైపోయినాఁడు.

రాత్రి పడమటావు నఱపులు విని కలఁతనొందిన హృదముతో నీశ్వరమ్మగారు వెలుఁగు రాకుండఁగనే గోశాలకు వచ్చినారు. కేశవుఁడే స్వయముగాఁ గుడితిని గలిపి పడమటావునకుఁ బోయుచుండెను. తల్లిగారు వచ్చుటను బరికించి వినమ్రుఁడై, కేశవుఁడు మెల్లగా హృదయభారముతో నీశ్వరమ్మగారియొద్దకు వచ్చినిలిచెను. కేశవుని దీనత్వమును గాంచి యీశ్వరమ్మగారు భయపడిరి.– "చిన్నా! ఏదియో కలఁత పొందినట్లున్నావే?" – కేశవుఁడు తీతువు విషయమును జెప్పినాఁడు. – "అమ్మా! ఈతీతువు కుమారదేవమున కేదో రాఁబోవు నాపదను సూచించినది. తెల్లవారి.తిండికై మనచుట్టుపట్టులనున్న గ్రామములనుండి పశుతతిని కొనుగోలుచేసి తీసికొని పోవుచున్నారఁట. మనగ్రామముకూడ వ్యామోహా పడునేమో!..." కేశవుఁ డిఁక చెప్పలేకపోయెను. ఈశ్వరమ్మ

గారి మనోవీధిలో దూరదూరానఁ జీకట్లు పొడసూపినవి. ఆమె గోమాతకు భక్తితో నమస్కరించి యింటికిమఱలెను.

కేశవుఁడు కాల్యకృత్యములను నిర్వర్తించిన పిదప నూరిలోనికిఁబోయినాఁడు. 'గ్రామచావడి' యందు రైతులెందఱో మూఁగియుండిరి. దొరవేషములో నొక యుద్యోగి యెక్కువ మూల్యమునిచ్చి తెల్లవారి భోజనమునకై ఆవులను, ఎద్దులను, మంచిరకములను కొనుగోలుచేయుటకై వచ్చియుండెను. "ఈదొరకుఁ గుమారదేవమున నేమి పనియున్న" దని వితర్కించుకొనుచుఁ గేశవుఁ డటకు వెళ్ళెను. కేశవమూర్తిని జూచి కొందఱు భయమును, మఱికొందఱు సంతోషమును బొందిరి. రైతులలోని చలనమును గ్రహించి యానల్లదొరయును "ఈతఁ డేయధికారియును గాదే? వీనినిజూచి రైతులిట్లు భయపడుదురేమి?" యని విస్మయమొందెను. కేశవునిజూచి యొక ముసలిరైతు సంతోషముతో "అడుగో. మన కేశవస్వామి! ఆయనయే యిందలి యుక్తాయుక్తములను నిర్ణయించును గాక!" అనుచు నసలు విషయమును జెప్పెను.

ఇది వినునప్పటికిఁ గేశవుఁడు నిలువెల్ల వణఁకి పోయెను. తీతువుచేసిన సూచన యింతలోనే మూర్తిమంతమైనదే!... కేశవుని కనులు జేవురించినవి. ఆతఁడు ధైర్యమును దెచ్చుకొనినాఁడు. "ఈదొరగారు భారతీయులేనా? దాస్యభావము బాగుగాఁ బట్టుపడినది. అసలీయనను గ్రామములోనికి రానిచ్చినవారెవ్వరు!" — చివరివాక్యమనునప్పటికిఁ గేశవుని

కంఠస్వరము హెచ్చిపోయినది. "......నేను జీవించియుండగా నొక్కజంతువేనియు మనుష్యుల యాహారమునకై యీయూరి నుండి కదలదు. నాకింతవఱకు క్రేప్రాణిపైఁ గోపముకాని, విరోధముకాని లేదు. జంతువుల నమ్ముఁదలచుకొన్న వారెవ్వ రేని ముందుగా నా కంఠ ముత్తరించి మఱి యా పనిని జేయుఁడు......" శోకము రూపుఁ దాల్చినట్లు కనులనీరు నించుచు నాతఁ డటనుండి కదలిపోయెను.

కేశవుని యప్పటిరూపమును జూచి యా నల్లదొరయును గంపించిపోయినాఁడు. రైతు లొకరిమొగము లొకరు చూచు కొనిరి. కేశవుఁడు రైతులపాలిటి భాగ్యదేవత యని వారి తలంపు. ఆతఁడు పుట్టినతోడనే కుమారదేవమున కైశ్వర్య మెత్తుకొన్నదని వారందఱి విశ్వాసమును—పశుతతి కేవిధమైన యాపదవచ్చినను గేశవుని హృదయము తునుకలై పోవునని వారు గ్రహించినారు. అందఱును సంప్రదించుకొని పశువుల నమ్మఁజాలమని నల్లదొరగారితో ఖండితముగఁ జెప్పివేసిరి. ఆతఁడు వట్టిచేతులతో వచ్చినదారి పట్టెను.

రైతుల నిర్ణయమును గేశవుని కెఱింగింపవలెనని యా ముసలిరైతు మాధవీమందిరమునకు వచ్చెను. కేశవుఁడు పొలములో నున్నాఁడు. ఆ వృద్ధుఁ డంతదూరమును సంతో షముతో నడచి వెళ్ళినాఁడు. కేశవుఁ డట పచ్చికబీడులలో మేయుచున్న యావులమందయొద్ద దుఃఖభారముతో నిల్చి యున్నాఁడు. "కేశవస్వామీ!" యని వృద్ధుఁడు దూరము

నుండియే పిల్చెను. కేశవుఁడు పరుగెత్తుకొనివచ్చినాఁడు. రైతుల నిర్ణయమును, నల్లదొరగారి పోకయు నాతఁడు కేశవునికిఁ దెల్పెను. కేశవుని యానందమున కవధిలేకపోయినది. "తాతా! ధన్యుఁడను." అని కేశవుఁడు వృద్ధునకు నమస్కరించెను. అతఁడు కేశవుని శిరమును మూర్కొనినాఁడు. తరువాత "గోపస్వామీ! శ్రీకృష్ణా! మమ్ములను గోవులను రక్షించుభారము నీయదియే" యని వారిరువురును బ్రార్థించుకొనిరి.

కాని తమకువచ్చు లాభములను జెడఁగొట్టివేసె నని కొందఱు తెలివిమీఱిన రైతులకు, మఱికొందఱు నవ యువకులకుఁ గేశవునిపై గుఱ్ఱుగానేయున్నది.

పౌర్ణమి వెళ్ళుటతోడనే గోపూజోత్సవములు ప్రారంభమైనవి. ప్రథమదివసమున రైతులందఱునువచ్చి రామయ్యగారి కుటుంబము నాహ్వానించుట యాచారము. కాని యానాఁడు కొందఱు ముఖ్యులే రాలేదు. కేశవుఁడు పరిస్థితుల తారుమారును గ్రహించినాఁడు. చంద్రా కేశవులు యథాప్రకారముగాఁ బడమటావును దొలుత పూజించిరి. వారిరువురకు నా యుత్సవము లుత్సాహము నీయలేదు. ఆ యుత్సవములలో నేదియోకళంక మప్పుడే ప్రవేశించినట్లు వారికిఁ దోఁచెను. కేశవుఁ డింటికివచ్చెను. వాని హృదయము వేసఁగిలోఁ దప్పలు వేసిన గోదావరివలెనున్నది. ఇట్లాలోచించినాఁడు—"రాఁబోవు సంవత్సరమున మమ్ముపిలుచుట కనలెవ్వరును రాకపోవుటయే కాదు: ఉత్సవములనేచేయుట మానుకొందురేమో ? బహుశః

ప్రతిసంవత్సరమును దప్పక జరుగుగోపూజోత్సవములకీయేఁటితో సరి కాఁబోలు!........."

ఏవియో నాశన సూచనములతో వాని హృదయము బాధపడ సాఁగెను. తక్కిన నాల్గురోజు లుత్సవము లెట్లు జరిగినవో, అసలు జరిగినవో లేదో వాని కక్కఱ లేకపోయి నది. ఆయేఁడు గోపూజోత్సవములకుఁ గొన్ని దివసములకు ముందే పుష్పలత కృష్ణదేవుని పాదసన్నిధికి వెడలిపోయినది. రాధిక లేకపోవుటచేఁ బువ్వులరంగని వేణువులోని రసమంతరించి పోయెను. రాధిక వేషమును ధరించిన వేఱొక దేవదాసి రంగన్నతో నభినయింపలేకపోయినది. ఆమెతో మాటాడుటకే రంగన్నకు మనసొప్పలేదు. ఉత్తమున కుత్సవము లేవియు రక్తికట్టలేదు.

## 11

ఎనిమిది నెలలనాఁటికి భిషగ్వరుని యలౌకికౌషధ శక్తియు, భవానీదేవి నిరంతరతపస్సును గిరిరావులో నారోగ్య మును, వానిహృదయములో పూర్వను సమకూర్చినవి. వానికిఁ బ్రాణసంకటము దిష్టముపోయినది. ఆతఁ డెవ్వరిని దన యొద్దకు రానిచ్చెడివాఁడు కాఁడు. వట్టి పరిచర్య సేయుటకు మాత్రము భవానిరావచ్చును. పోవచ్చును. ఆతఁ డాపె పరిచర్య లందుకొనునే కాని యామెతో మాట్లాడఁడు. భవాని వెను దిరిగిపోవుచున్నప్పు డామె చూడకుండ వానిచూపు లామెను

బరిశీలించు చుండును. ఎప్పుడేని యాపెళరీరము వానికిఁ తగిలి నచో వాని యొడలిలో నేదియో యననుభూతమైన విద్యుత్ప్రవహించెడిది. అకదలిక కామసంబంధికాదు. ఏదియో వానికిని దెలియదు. ఆతని శయనగృహ మిప్పు డేదో యొక క్రొత్త జీవితమును, ఒకక్రొత్త యందమును బుణికిపుచ్చు కొన్నది. గిరిరావుబాబు మంచమున కెదురుగా వారి తల్లిగారి పటమును భవాని పెట్టించినది. అక్కడక్కడ రాజకీవిని వెల యించుచున్న పూర్వపు రామగిరిజమీందారులచిత్రపటములు కూడ నలంకరింపఁబడినవి.

గిరిరావు తనశయనాగారమందలి మార్పును గుర్తించి నాఁడు. తాను జేయించిన యలంకారమునంతటిని రూపాంతర మొందించిన భవానిపై వానికిఁ బట్టరానికోపము వచ్చినది. అట్లుచేయుట కామె కేమి యధికార మున్నది? ఒకనాఁ డిట్టి యాలోచనలో నుండగా గిరిరావునకుఁ దనతల్లిగారి పటమెదు రుగాఁగన్పించినది. నిదానించిచూచినాఁడు. తోడనే భారతియు వానిజ్ఞప్తికివచ్చెను. "స్వామీ! ఈబాలికకు మీతల్లిగారి పోలిక లన్నియును వచ్చినవఁట!" అని భవాని యానాఁడు విన్నవించిన మాటలు వానిగుండెపైఁ గొట్టిన ట్లయ్యెను. అప్రయత్నముగా నాతఁడు చేతులు జోడించి తల్లిపటమునకు నమస్కరించెను.—"అమ్మా! నేనన్నచో నీకుఁ బంచప్రాణ ములును. నానడతకు దుఃఖించుచునే మరణించినావు. నా యందలి ప్రేమచే మరల నాకుఁబుత్రికవై జన్మించితివిగాబోలు.

తెలిసికొనలేక పోతిని. క్షమింపుము..." అని యాతఁ డను కొనెను. ప్రప్రథమముగా వాని కనుకొలుకులలో నీరునిలిచి యట్టె మాయమైపోయెను.

తండ్రిగారు విశ్రమించినారో లేరో చూచుటకై భారతి యక్కడికి వచ్చినది. గిరిరావామెను జూచెను. వెనుదిరిగి వెళ్ళి పోనున్న భారతి నిలఁబడెను. ఈ మనోహరమూర్తినా తానస హ్యించుకొనుట?...భారతిని దగ్గఱకు రమ్మని గిరిరావాకింత సేపటికి సైగచేసెను. ఆశ్చర్యముతో, నమ్రతతో భారతి తండ్రి యొద్దకు వచ్చినది. గిరిరావామెచేయిపట్టుకొని తనమంచముపై కూర్చుండఁబెట్టుకొనెను — "అమ్మా! నీపేరేమి?" అని గిరిరా వడిగెను. తన్నాతఁ డట్లుపిలుచుటకు భారతి చకితయయ్యెను. గిరిరా వామెను దనతల్లిని బిలిచినట్లే పిలిచినాఁడు — "భారతి" యని యామె చెప్పెను.

"నే నెవ్వఁడనో నీకుఁ దెలియునా" అని గిరిరావు ప్రశ్నిం చెను. భారతి కర్థముకాలేదు. భారతి తండ్రికి నమస్కరించి "మీరు మా నాన్నగారు. మా అమ్మ చెప్పినది." — "మీ అమ్మ యెవరు?"—"మాఅమ్మనే యెఱుఁగరా! ప్రతి నిత్యమును మీసేవచేయుట కిచ్చటికి వచ్చుట లేదా? ఆమె అసలు నాకన్నతల్లి కాదఁట! అయిన నేమి? నా కామెయే అమ్మ. నే నిప్పు డామెను నా కన్నతల్లికంటె నెక్కువగాఁ దలంచుకొనుచున్నాను..." దీనత్వమును, గౌరవభావమును ఒకేపరి యామెలో గిరిరావు చూచెను. బహువిధములగు

నాలోచనలతో గిరిరావు తలపంకించుటచేఁ దాను జెప్పిన దర్థమైనదని భారతి తలంచెను.

"...నేనన్నచో అమ్మకెంతో ముద్దు. నేను నాయనమ్మగారివలె నుందునఁట. అందఱందరు...మీరన్నచో అమ్మకెంత ప్రేమయో తెలియునా? ఎల్లప్పుడును మిమ్మే స్మరించుకొనుచుండును. మీ కారోగ్యము కలుగవలెనని యెల్లప్పుడును దపించిపోవుచుండును. పూర్వముకంటె మీరిప్పుడు చాల ఆరోగ్యముగా నున్నారు. త్వరలో మీకుఁ బూర్తిగా నారోగ్యము కలుగునని వైద్యులు అమ్మతోఁ జెప్పినారు." అని భారతి యనేకవిషయము లొక్కుమ్మడిలోఁ జెప్పివేసినది. గిరిరావున కేదోలోకములో నున్నట్లున్నది. "అమ్మా! భారతీ! నీవేమి చదువుకొనుచున్నావు?" అని యేతలంపును స్థిరముగా నూహింపలేని గిరిరావు ప్రశ్నించెను.

"నాన్నగారూ! మా పెద్దమామయ్య యున్నాఁడఁట! మా అమ్మ చెప్పినది. ఆయనతో నేనింక రెండుమూఁడేండ్లలోఁ బోటీచేయఁగలనఁట!" అని భారతి సగర్వముగఁ జెప్పెను. భారతిమాటలు గిరిరావున కాశ్చర్యము కల్గించెను.—"అమ్మా! ఇంత చదు వెక్కడ నేర్చితివి?" అని గిరిరావు ప్రశ్నించెను — "ఇంతమాత్రము తెలియదా?" యన్నట్లుగా భారతి నవ్వెను.— "అమ్మయే చెప్పినది"—కొంచెమాఁగి, "అమ్మ ఎంతచక్కగాఁ జెప్పుననుకొన్నారు? వాల్మీకి మహర్షి కూడఁ గుశలవుల కంత చక్కగాఁ జెప్పినాఁడో లేదో...అమ్మకూడ మామయ్య

యొద్దనే చదువుకొన్నదఁట. అసలు మామయ్యను మీరెఱుఁగుదురా!......" భారతి ప్రశ్న గిరిరావు వినలేదు. అతఁడు భవానిరూపమును నొక్కసారి స్మరించినాఁడు. ఆమెలో వానికిఁ జదువులసరస్వతి సాక్షాత్కరించినది. వాని మనోభావముల మార్పు ఇంకొక మెట్టెక్కఁగొనెను.

"అమ్మయొద్దకు వెళ్ళిపో భారతీ!" అని చెప్పి యాతఁడామెను బంపివేసెను. ఆ యాకస్మిక చర్యకు వింతనొందుచు భారతి భవానియొద్దకుఁ బోయి తనకు సంభాషణ సర్వమును జెప్పెను. తన తపస్సు ఫలించినదని భవాని పొందిన యానందమునకు మితిలేకపోయినది. గిరిరావు మంచముపైఁ బండుకొనెను. పట్టుపరుపులమీఁదఁ బరుండియున్నను ఏమో గ్రుచ్చుకొనుచున్నట్లే యున్నది. భారతితల్లి వానికి స్వప్నములోఁ గన్పించినది. ఆమె ముఖములో ప్రశాంతియును గంభీరత్వమును దనయెడ విశ్వాసమును దోఁచినవి. గిరిరావు చకితుఁడయ్యెను— "దేవి! నిన్ను బాధించితిని. సౌందర్యరాశివైన నిన్ను నేను సుఖింపనీయలేదు. పత్నినై నీ సుఖములను లేవనుకొంటిని కాని నీ హృదయమును గ్రహింపనైతిని. నీమీఁది యేవగింపుతోనే మన పాపనుగూడ నే నీతనుజ నాదరింపలేను. నా తప్పిదమును క్షమింపుము......" అని గిరిరావు పలికెను. వానికిఁ దెలివివచ్చినది. వానికన్నులనుండి రెండురెండు ఉష్ణాశ్రుబిందువులు క్రిందికిజారినవి. ఆ రెండును వానిలోని కళంకము నంతటిని గడిగి వేసినవి.

గిరిరావు నిష్కళంకచిత్తుఁ డయ్యెను. కాని హృదయ మింకనుజలించిపోవుచున్నది. "భారతి నాచిట్టితల్లి"—వాని పితృ హృదయము కదలాడిపోయినది. "భారతి నాచిట్టితల్లి" అని యాతఁడు రెండుమూఁడు సారులు పైకనుకొనినాఁడు. ఆమె నెత్తి ముద్దాడువఱకును వాని హృదయ మాఁగినదికాదు. లేచి కూర్చుండుటకుఁ బ్రయత్నించెను. కాని హృదయభారముతో లేవలేకపోయి సగములేచి వెనుకకుఁ బడిపోయినాఁడు. గిరిరావు పంపించిన యొక పరిచారికవచ్చి "అమ్మా! దొరగారు రమ్మను చున్నా" రని సంభ్రమముతో భవానికిఁ జెప్పెను. వెంటనే భవాని లేచి భర్తకడకు వెడలిపోయెను. భారతి కన్నులలో నానందము వెల్లివిరిసినది.

భవాని వచ్చునప్పటికి గిరిరావు హృదయ మింకను దడదడపడుచునే యున్నది. భవానితో నేమి మాట్లాడవలెనో వానికిఁ దెలిసినదికాదు. నిమీలితనేత్రుఁడై కదలకుండఁబండు కొని యుండెను. భర్త నిద్రపోవుచుండెనని భవాని యూహించెను. ఆనాఁడు కొంచెము ముక్కుపోఁతిగా నుండుటచే భర్త సుఖముగా నిద్రపోవలెనన్నయూహతో నామెవీవనతో వానికి గొంతసేపు విసరెను. ఆచల్లగాలి కాతఁడు గాఢనిద్రలో నున్నట్లు కనిపించెను. ఆమెలేచి భర్తపాదములయొద్ద మోకరిల్లి నమస్కరించినది. గిరిరావుపాదములామెకుఁ దగిలినవి. ఆమెకు భర్త లేచునేమో యన్న భయముచేసెను. "భవానీ!..." అని రుద్ధకంఠముతో గిరిరావుపిల్చినాఁడు. భవాని యులికిపడి

తలెత్తినది. ఆతఁ డసలు నిద్రపోవుటలేదు. అవిరళబాష్ప ధారతో దుఃఖించుచున్నాఁడని యామె గ్రహించినది. ఆమె భయపడిపోయెను.

"భవానీ! నీవు దివ్యాంశసంభూతురాలవు. నేను కేవల మైహికవాంఛాలాలసుఁడను. నీ మహత్తరమగు సేవలో నా తుచ్ఛభావములు క్షాళితమైపోయినవి. నిన్నటినుండియు నేను పడినబాధ కంతు లేకపోయినది..." సగము చెప్పి గిరిరా వాఁగెను. భవానిహృదయము దడదడఁ గొట్టుకొన్నది. — "ప్రభూ! మీ ఆరోగ్యము బాగుండలేదు. మనోదైన్యము శరీరమును కోలుకోనీదు. నాయందు దయయుంచి, మీరు చింతను విడిచి నిర్మలముగా నుండుఁడు." అని యామెకోరెను. గిరిరావు మరలఁ జెప్ప నారంభించినాఁడు — "......భవానీ! నీ హృదయము నా కవగాహనమైనది. నీవు సేవించుచుండ నా కారోగ్యము లేకపోవుట యెట్లు? నీ యమృతహస్తములతో నా యెద నొక్కసారి నిమురుము. పశ్చాత్తాపాగ్నిచే దగ్ధుఁడ నగుచున్న నేను శీతలచిత్తుఁడ నగుదును......"

గిరిరా వింకను నేదియో చెప్పఁదలంచెను. భవాని వానిని దాఁకినది. వానిలో నూత్నచైతన్యము వచ్చినది. ఆమె వాని హృదయముపైఁ జేయి వేసినది. ఆతఁడు స్వర్గసౌఖ్యము ననుభ వించినాఁడు.

కొంతవడికి గిరిరావు "చిట్టితల్లి యెక్కడ!" అని భవాని నడిగెను. "తీసికొనివత్తును స్వామీ!" అని భవాని భర్తను

మెల్లఁగా బరుండఁబెట్టి గదియావలకువచ్చెను. భారతిని బెంచిన ముసలిదాది యెదురువచ్చినది. "భారతిని దీసికొనిరా" మ్మని భవాని యామెను బంపెను. ఆ ముసలిదాది యొక్కదూఁకునఁ బోయి భారతి సమాంతముగా నెత్తుకొని వచ్చినది. "చిట్టి తల్లీ!" యనుచు గిరిరావు భారతి శిరమును దనివితీర ముద్దాడినాఁడు. వాని పితృహృదయము కట్టులు తెగినట్లైనది. కనుల నుండి యానందబాష్పములు ప్రవహించినవి. భారతికిఁ బునర్జన్మ మెత్తినట్లున్నది. — "భారతీ! నిజముగా నీవు భారతివే యగుదువమ్మా!" అని తండ్రి యింకను ముద్దాడెను. భవాని పరవశయైనది. దాని యానందస్వాంతయై నిలువఁబడెను. ఆమె కంతకంటె నేమి కావలెను?

విజయుని కిప్పు డేడవయేఁడు వచ్చినది. చెప్పినమాట వినుట నాతఁ డెఱుంగఁడు. వానిపోకయే వానిది. ఆతఁ డెక్కువ కాలము చంద్రా కేశవులతోఁ గడిపెడివాఁడు. ఉదయముననే రజనీకాంతరావు వానిచేఁ గాల్యకృత్యములను నిర్వర్తింపఁజేయును. వెన్వెంటనే యాతఁడు పినతల్లియొద్దకుఁ బోయి పలహారము తిని కేశవునితోఁ బాఠశాలకుఁ బోవును. కేశవుఁ డొకవేళ ముందుగా వెళ్ళినచో విజయుఁ డొంటరిగానే వెళ్ళును. ప్రొద్దుతిరుగుచున్న దనగా నిరువురు నింటికివచ్చి భుజింతురు. పిమ్మట రజనీకాంతుని విజయునితోఁ గలసి మేడమీఁదనున్న రాయుల గదిలోనికిఁ బోవును. విజయుఁడు తండ్రితో నెన్నియో మూఁగపలుకులను జెప్పెడివాఁడు. మొదటిరోజులలోఁ గుమారుఁ డిట్లయ్యె నేమని

రాయలు విచారించెడివాఁడు. దాని క్రమక్రమముగా వానికి విజయుఁ డన్నచో మిక్కుటమగు ప్రేమ యేర్పడినది. విజయుఁ డొక నాఁ డాజన్మ్మడనియు వాని కొఱకుఁ జేయు సేవవలనఁ దమ జీవితములకుఁ బ్రశాంతి చేకూర్చుననియు నాదంపతులు తలంచిరి.

సాయంకాలమున విజయుఁడు తండ్రితో నుద్యానవన విహారమున కేఁగును. గోదావరిలో నిరువురును జీకటి పడు చుండగా స్నానమాచరించి యింటి కేఁగుదురు. నిదురనోనదుగిడి నంతనే విజయుని తొడలు క్షాల్కరించును. పిమ్మట మానంపమున నీటిలోఁ గూర్చుండి తెపతెపఁ గొట్టుకొనెడివాఁడు. రాయలు నీటిపైఁ దేలి పద్మాసనము వేసి యోగాభ్యాసమును జేయు చుండును. అంతకాలము పల్లరి మాని విజయుఁడు శ్రద్ధాభక్తులతో నొడ్డునఁ గూర్చుండి తా "నోం" కారమును జపించెడివాఁడు. సాయంకాల మట్లు స్నాన మాచరించుటాలస్యమైనచో విజయునకుఁ బిచ్చియెత్తినట్లుండును. రాత్రి భోజనానంతరము విజయుఁడు తాతగారియొద్దను, నాయనమ్మయొద్దను గూర్చుండి చాలసేపు మాట్లాడును. వెన్నెలరాత్రులందు రజనీకుమారియును కృష్ణరాయలును కుమారునితోఁ గలసి సౌధమునకు వెనుకనున్న కృత్రిమసరస్సుకడకుఁ బోవుదురు. ప్రకృతిసౌందర్య పిపాసువులగు నా మువ్వురొక్కొక్కనాఁ డుద్యానవనములోఁ జాలసేపు కూర్చుండి పోయెడివారు.

రజనీకుమారికిని, రాయలకు నిట్లు కొంతకాలము కుమారునితోఁ బ్రొద్దుపోయెడిది. క్రమముగా వారు వేదనావిముక్త

లైనారు. ఎప్పుడో యొకప్పు డాకస్మికముగాఁ దాము విశ్వ శ్రేయమునకై రంగస్థలమును ప్రవేశింపవలసి వచ్చుననియు నందులకై శక్తిని, ధైర్యమును సంపాదించుకొనుటయే తమ కర్తవ్యమనియు వారొక నిశ్చయమునకు వచ్చిరి.

# 12

గోదావరీ మహానదికి గౌతమియని వేఱొక పేరున్నది. ఇప్పటి గోష్పాదక్షేత్రప్రదేశములోఁ బూర్వము గౌతమమహర్షి తపస్సు చేసికొనుచుండెడివాఁడు. ఒక గొప్ప కాటకములో తిండి దొరకక తత్ప్రాంతవాసులగు మునులందఱు గౌతమాశ్రమము నకు వచ్చిపడిరి. గౌతముఁడును వారినందఱ నాదరించి తనతపో బలమువలన నీవారధాన్యము నేనాఁటి కానాఁడే పండించి వారి కందఱకును సమృద్ధిగా నాహారమును సమకూర్చుచుండెను.

ఇట్లుండగా నొకనాఁ డొకయావు మందలోనుండి తప్పి వచ్చి పైరంతయును దినివేసెను. ఇఁక మునులందఱు నాఁటికిఁ బస్తుండవలసినదే......కోపమున గౌతముఁ డాయావు నొక గడ్డిపోచతో నదలించెను. అంతమాత్రముననే ఆ యావు క్రిందఁబడి విలవిలఁ దన్నుకొని ప్రాణములు వీడెను. గోహత్య చేసితివి కాన నీయాశ్రమమున నుండ నొల్లమని మునులెల్లరు కట్టుగా లేచిపోయిరి. గోహత్యాపాపము తనకుఁ జుట్టుకొని నందులకు విచారించి గౌతముఁడు శివునిగూర్చి గొప్పతపము కావించెను. ఆ పరమశివుఁడు తన జటాజూటమునుండి గోదా

వరిని విడిచిపెట్టెను. గౌతముఁ డానదిని దనవెంటఁ గొనివచ్చి యాయావు చనిపోయిన ప్రదేశమునీఁదుగాఁ బ్రవహింపఁజేసి పాపవిముక్తుఁ డైనాఁడు.

గౌతముఁడు కొనివచ్చుటవలన నానది గౌతమియైనది. ఆగోవు పేరిమీఁదుగా నాప్రదేశము గోష్పాదక్షేత్రమైనది. ఒకగోవు పేర నింతపని జరుగుటచేఁ బ్రక్కనేయున్న గ్రామమునకుఁ గూడ గోవూరను పేరువచ్చెను. గోహత్యా పాపమును క్షాళితముచేయఁగల పవిత్రత యానదికిని, ఆ ప్రదేశమునకు నున్నది. అట్టి గోదావరీతీరమున, అ గోష్పాద క్షేత్రమునకు నూఁడుక్రోసుల యెగువను గుమార దేవ మున్నది. ఒక్క గోహత్యచేసినందులకే — అదియును హఠాత్సంభవము—కుమిలి పోయి గౌతముఁ డొక మహానది నావిర్భవింపఁ జేసినాఁడే! నేఁడుజరుగుచున్న గోహత్యాదిపాపములు ప్రపంచమంతయును సముద్రమయమైపోయినఁగాని క్షాళితములు కావు గాబోలు!

శ్వేతముఖుల యాహారమునకై పశువులను గుత్తగా గొనుటకుఁ గుమార దేవమునకు వచ్చిన నల్లదొరగారదేపోకను బోయిరి కాని, యట్టివారే చాలమంది కుమారదేవమునకు జుట్టుపట్టుల నున్న గ్రామములందుఁ బ్రవేశించి సఫలులైరి. రాయలు కేశవుఁడు నీ విషయమును విని చాల బాధపడి నారు. కేశవుఁడు నడుముకట్టుకొని గోసేవ చేయువాఁడే కాని ఆ యావశ్యకము నందఱకును బోధించి చేయింప శక్తికల వాఁడు కాఁడు. ఆవిషయములో రాయలే సమర్థుఁడు. కేశవుని

జీవితము సేవకును, రాయలజీవితము బోధనకు నేర్పాటై యున్నవి. చంద్రరేఖ, రజనియు రాయా కార్యములం దాయిరువురకును దోడ్పడుచుండిరి. కాని సాహిత్యాచార్యుడైన యన్నగారిపని కొంచెము జెడిపోవుచునని కేశవుడు సందేహించి నాడు. అసలు ఊరూరు తిరిగి గోసంరక్షణావశ్యకమును గూర్చి యుపన్యసింప వలసినదని తానడుగ నెంచుచున్నను కాని వానికి ధైర్యము చాలలేదు. రాయలు తానై రంగమున ప్రవేశించుట కాలోచించుచుండెను.

ఇట్లుండగా వర్షర్తువు వచ్చెను. వర్షములు కుంభవృష్టిగాఁ గురిసినవి. గోదావరి వరద అపరిమితముగా వచ్చి యొడ్డున నున్న యూళ్ళన్నియు నీట నెసెను. కుమారదేవపురమున నెచ్చటఁ జూచినను నీరు కాలువలై ప్రవహించినది. ఇందులకుఁ దోడు పశువులలో నకస్మాత్తుగా జబ్బులు ప్రవేశించినవి. కింక, దొమ్మ మొదలైనజబ్బులుతగిలి పశువులునిలుచున్న పాటుననే జనిపోసాఁగి నవి. మాంసవ్యాపారమువలననే పశుసంతతి తగ్గిపోవుచున్నదని కుందుచుండగాఁ గఱవులో నధిక మాసము వచ్చినట్లాయినది. ఊరిలో నారోగ్యవిషయములందును శ్రద్ధ తక్కువయ్యెను. గ్రామమంతయు నీటతో నిండి యుండుటవలన జబ్బులు తగి లిన పశువులకుఁ దగిన వైద్యము చేయించుటలోఁగాని, చని పోయిన వానిని దూరముగాఁ బాతిపెట్టుటలోఁగాని గ్రామ వాసులు శ్రద్ధవహింప లేకపోయినారు. కేశవుఁడు మాత్రము పశువుల జబ్బులకు వలసినమందుల నెట్లో సేకరించి యూరిలో

జబ్బుతగిలిన పశువులన్నిఁటికిని మందు లీయసాఁగెను. రాయలీ బీభత్సమును గాంచి చలించిపోయినాఁడు. తమ్ముని యనుప మానమగు సేవను బ్రశంసించుచు మెల్ల మెల్లఁగాఁ దానుగూడ రైతుల కారోగ్య విషయములను గూర్చి బోధింపసాఁగెను.

ఇంతలోఁ గేశవుని పడమటావునకు దొమ్మ తగిలినది. దానిపాలు త్రాపుటచే మూడవది గూడ నా జబ్బు తగిలెను. వాని జబ్బును మళ్ళించుటకై కేశవుఁడు తన యావచ్ఛక్తి నుప యోగించెను. చంద్రశేఖరుఁడు సర్వవిధములఁ దోడ్పడి గోసంతతికి మరలఁ గళఁ దేఁ బ్రయత్నించెను. కాని వారికష్టము ఫలింప లేదు. నాఁటిరాత్రి పడమటావు గిజగిజఁ దన్నుకొన మొద లిడెను. 'దొమ్మ' దొంగరోగము. అది తగిలిన పశువు నశించు టయేకాని బ్రతికి బైటపడుటలేదు. మొదటిజాము దాఁటినది. 'తీతీ' యనుచుఁ దీతువు పడమటావుమీఁదుగా నెగిరిపోయి నది. ఆ యరుపున కదరిపడి పడమటావు ప్రాణము విడిచెను. కేశవుఁ డారాత్రి గోమాతశవముపైఁ బడి పిల్లవానివలెనే యేడ్చి నాఁడు. తెల్లవారుజామునఁ బడమటావు దూడకూడఁజనిపోయి నది. పడమటావునకు దానిదూడకు నంత్యక్రియలు కావించి జ్వరముతోఁ గేశవుఁడింటికిఁ దిరిగివచ్చెను. తన ప్రాణమగు పడమ టావుచావుతోఁ గేశవుఁడు క్రుంగి పోయినాఁడు. మరల నాతఁడు లేచి తిరుగలేదు. గుండె బరువెక్కినది. పిచ్చిచూపు వడెను. ఈశ్వరమ్మగారు పెక్కుసారులుకుమారునోదార్చుటకుఁ బ్రయత్నించినారు—"అమ్మా! తీతువు చేసిన సూచన ఎంతలో

నిజమైనదో చూచినావా ?" యనుచు నాతఁడు వాపోయెడి వాఁడు. ఆమెకు దుఃఖము పొంగివచ్చి కుమారుని మొగము చూడలేక పోయెడిది. రామయ్యగారికిఁ గుమారునియొద్ద కూర్చుండుటకే ధైర్యము చాలలేదు.

రాయలు తన తమ్ముని బాధకుఁ గరఁగి పోయినాఁడు. తమ్ముని ధైర్యమిప్పుడు ఛిన్నభిన్నమైపోయినది. ఈ సమయములోఁ దాను జేయూత నిచ్చుచో మరల నాతఁడు కోలుకొని గోసేవకై తనజీవిత సర్వస్వమును వినియోగింపఁగలఁడు. అట్టియెడ తానేపనియునుజేయక యింటఁ గూర్చుండుటకంటె వానితోఁ గలసి గోసేవచేయుచుఁ బ్రకృతి యుత్కృష్టతకై పాటుపడుట మంచిదికాదా యని తర్కించుకొనినాఁడు. అందులకు రజనీకుమారి సాహాయ్యమునుగూడ నపేక్షించెను. ఆమె సంతోషముతో నొప్పుకొన్నది. దృఢనిశ్చయముతో రాయలు తమ్ముని బల్కరించినాఁడు — "కేశవా! ... గోసేవయే గోవిందునిసేవ యని నమ్మియున్న నీ జీవితములో నొక చిన్నయడ్డు వచ్చిపడినది. అందులకు నీ వధైర్యము నొందవలదు. నీకు నా పూర్తిసాహాయ్యము నొసఁగుదును. మన మిరువురమును గలసి ప్రకృతిని మరల నున్నతస్థితికిఁ గొనవత్తము. నీవు ధైర్యము నొందితివా త్వరలోఁ గోలుకొనఁ గలవు....." అని రాయలు కేశవునిజేతిలోఁ జేయివేసి చెప్పెను. — "అన్నా ! నేను ధన్యుఁడను. నే నింక విజయమందినట్లే!" అని యాతఁ డానందబాష్పములు రాల్చెను.

ఊరిపరిస్థితులెవ్వియు విజయునకు బోధపడలేదు. సర్వమయోమయముగానున్నది. క్రమముగానాతని దినచర్యమారి పోయెను. చాల నాలస్యముగా నిదురలేచి వెంటనే యుద్యానవనములోనికిఁ బోయెడివాఁడు. రెండుజాములు తిరుగువఱకు నే చెట్టునీడలనో సంచరించి యప్పు డింటికిఁ దిరిగి వచ్చును. కుమారుని తిరుగుడును గాంచి రజనియు, రాయలును జాల భయపడిరి. గట్టిగ గదమినచో నేడ్చును. లాలించినచో నసలే వినఁడు. చేయునదిలేక వాని యిష్టమువచ్చినటుల వదలివేసిరి. కాని, ఒక కంట నెల్లప్పుడు వానిని గాచియే యుండిరి. విజయుఁడు సాయంసమయములందు గోదావరియొడ్డునకు వచ్చి నీళ్ళలోఁ బాదములుంచి కూర్చుండెడివాఁడు. ఆకసమునఁ దిరుగాడు పక్షులను విజయుఁడు చిత్రముగఁ జూచుచుండును. నీటిపైఁ దేలిన మీనమును, అంతవరకు నాకసమునఁ బల్టీలు కొట్టుచు నాకస్మికముగాఁ గాలం దన్నుకొనిబోవు తీతువును జూచి "ప్రపంచమింతేగదా!" యన్నట్లాతఁడు పకపకనవ్వును. అచ్చటఁ దిరుగాడుచుండు వానిమిత్రము, హరిణ మానవ్వునకు జెదరును. ఇఁక విజయుని నవ్వునకంతేయుండదు. లోకులకొక్కయూరు చొప్పునఁ బ్రచారముచేసి వచ్చు రాయలును, గోశవుఁడును జీఁకటిపడుచున్నదనఁగా స్నానార్థము గోదావరికివత్తురు. అప్పుడువిజయుఁడును వారితోస్నానమాచరించి యింటికేఁగును.

ఒకనాఁడు రజనీకుమారి విజయుని కక్షరములను నేర్పవలెనని ప్రయత్నించెను. విజయుఁడు లొంగలేదు. రజనికి విసువు

ఇచ్చి కోపముతో నొకటివేసినది. అంత ముక్కుమూసికొని నీటిలో మునిగిపోయెద నన్నట్లు "యమునా యమునా" (గోదావరి నదిని 'యమునా' యని మూలగ్రంథములో వ్రాసినారు. ర. న.) అనుచు మూల్గుచు మునకలు వేసె. రోషమునుబట్టజాలక విజయుఁ డేడ్చెను. రాయలుకూడ వాని నూరుకొనఁబెట్టలేకపోయెను. తాతగారువచ్చి మనుమని దీసికొనివెళ్ళి లాలించిరి. రజని చాల నొచ్చుకొన్నది. వానికంత రోష మేలవచ్చెనో రాయలు బూహింపలేక పోయినాఁడు. గోదావరిలో మునిగిపోయెద నన్నట్లాతఁడు చేసిన సంజ్ఞ కర్థమేమి?... విజయుని ప్రవర్తన వలన ననేకములగు నూహలు రాయలమనోవీథిని జెలరేగి వాని మనస్సును కలవరపెట్టినవి. రజని రామయ్యగారున్న యెడకు వెళ్ళెను. అప్పటికి విజయుఁడింకను నిదురపోలేదు.

"బాబూ! అమ్మ వచ్చినది. నిదురింపఁబొమ్ము" అని రామయ్యగారు మనుమని బంపివేసిరి. రజని కుమారుని దోడ్కొనివచ్చి మంచముపైఁ బరుండెను. "విజయా! నాపై కోపము వచ్చినదా ?" అని యామె కుమారుని లాలించెను. లేదన్నట్లాతఁడు తలయూపెను. కాని ఉదయమునవాని యెఱ్ఱ వాఱిన కన్నులఁ గని రాత్రి యాతఁడు నిద్రింపలేదని తల్లి గ్రహించి చాలబాధపడినది. విజయుఁడు యథాప్రకారముగా నాల్గురోజులు సంచరించినాఁడు.

ఆనాఁ డేకాదశి. విజయుఁ డానాఁడు పెందలకడనే లేచి కాలకృత్యములను నిర్వర్తించుకొని, తెల్లనియుడుపులనుదాల్చి

యుద్యానవనములో నికేతనమాయెను. అతఁ డింతకాలమునుండియు గంధపుఁదోఁపులోని కెన్నఁడును బోలేదు. ఆనాఁ డేలొకో గోదావరి యొడ్డు వెంబడినే నడచి, మామిడితోఁపును దాటి యాతఁడు గంధపుఁ జెట్లను జేరినాఁడు. ఆప్రదేశ మంతయును గమ్మని వాసనలతో నిండియున్నది. జిలుగుఁ గాంతులను బఱపుచు చెట్లక్రొత్తాఁచు గంధపుఁబ్రమాఁకును జుట్టుకొని విజయుని కంటఁ బడెను. దానికన్నులు చిలిపి చూపులతో విలసిల్లినవి. అటువంటి వానికి [illegible] పడినదికాదు. అంత నొక చిన్న శిలాఖండము నేరి క్రొత్తాఁచుపై విసరినాఁడు. క్రొత్తాఁచు బుస్సు మనుచుఁ బడగవిప్పినది. విజయుఁడు భయపడి వెనుకకుఁ బరు వెత్తెను. త్రాఁచు యథాస్థితిని గంధపుఁబ్రమాఁకును జుట్టుకొని పడియుండెను.

విజయుఁడు తిరిగి దగ్గరకుఁజేరి త్రాఁచుపై మరల నింకొక రాయి విసిరెను. వెనుకటివలెనే త్రాఁచు భయపెట్టినది. విజయుఁడు పారిపోయి, తిరిగివచ్చి యింకొకమా అటులనే చేసెను. త్రాఁచునకు కోప మెక్కువైనది. పూర్తిగాఁ బడగవిప్పి గంభీరముగ బూత్కారమొనర్చెను. ఈసారి విజయుఁడు నిశ్చయముగ నిలిచినాఁడు. త్రాఁచు పడగను గంధపుఁబ్రమాఁకునకు వేసి కొట్టుకొనెను. పడగ చితికి రక్తము కారెను. మరల నింకొకమాఱు కొట్టుకొనెను. త్రాఁచు ప్రాణము లెగసిపోయినవి. నిశ్చేష్టుఁడై విజయుఁడు చూచుచుండెను — త్రాఁచు ప్రాణవాయువులు గాలిలోఁ గలసిపోయినంతనే రామయ్యగారి పొలములో నీటిజల

పడినచోట నూతినుండి ప్రవాహము వచ్చుట యాఁగిపోయినది. త్రాఁచుఁ చనిపోవుటకును, నీటిజల యాఁగిపోవుటకునుగల యాంత రంగిక భావమేమో యెవ్వరును నూహింపలేక పోయినారు-త్రాఁచు చర్యనుగాంచి విజయుఁడు భయపడినాఁడు. వాని తెల్లని గుడ్డ పులపైఁగూడ రక్తముచిందెను. వెన్వెంటనే యాతఁడు గోదావరిలో స్నానమాచరింప నెంచి మామిడితోఁపున కెదురుగా నున్న రేవులో దిగినాఁడు.

విజయుఁ డింతవఱ కెన్నఁడు నొంటరిగా గోదావరిలో స్నానమాచరించి యెఱుఁగఁడు. ఆనాఁడు - పరధ్యానములో నున్నాఁడేమో-నీటిలో దిగి కమీజును సగమువఱకు విప్పెను. అకస్మాత్తుగా వాని కనులయెదుట రక్తసిక్తమైన పడగతోఁ ద్రాఁచు ప్రత్యక్షమైనది. విజయుఁడు చలించినాఁడు. కాలుజారి పోయినది. కమీజు సగమువఱకు విప్పుకొని యుండుటచే నది చేతుల కడ్డము వచ్చెను. విజయుఁ డిఁక నిలువఁ ద్రొక్కుకొన లేక ప్రవాహముతో సాఁగిపోయెను.

## 13

గోదావరీ మహానది నిత్య జీవనది. ప్రత్యేకనదులుగఁ బరిగణింపఁ దగిన వైనగంగ, వరద, ఇంద్రావతి, శబరి మొదలైన ప్రవాహములు గోదావరి కుపనదులగుటచే దాని వఱదలు విపరీతముగా నుండును. ఆనీ రంతయు వ్యర్థముగ సముద్రమునఁ బడకుండ గోదావరికి దుమ్ముగూడెము నొద్దను,

ధవళేశ్వరము నొద్దను రెండానకట్టలు కట్టబడినవి. అందువలన నేర్పడిన కాల్వల నీటితోఁ బదిలక్షల యెకరములు మొదటి రెండవ పంటలు సాగుబడి యగుచున్నవి.

అట్లుపయోగపడిన నీరుకాక ప్రతిసంవత్సరము కొన్ని లక్షల ఘనపుటడుగుల నీరింకను వ్యర్థముగ సముద్రముసఁ బడుచున్న దని లెక్క వేయఁబడినది. కుమార దేవమున కిరువదిమైళ్ళ యెగువలో నున్న పోలవరమునొద్ద నొక యడ్డకట్టకట్టి భద్రాచలము మొదలు పోలవరము వఱకు నది నొక హ్రదముగా మార్చినచో నిప్పుడు వ్యర్థమగుచున్న నీటితో నదికిఱుప్రక్కల నున్న మెరకప్రదేశములకు సులువుగ నీటి నందఁజేసి కొన్ని లక్షల యెకరములను సాగుచేయ వచ్చును. అంతేకాక గొప్ప విద్యుచ్ఛక్తికూడ నుద్భవించును. ఆశక్తితో మనవరి శ్రమ లెంతో యభివృద్ధికివచ్చి మొత్తమున కాంధ్రదేశము స్వయంపోషకమును, సుభిక్షమును గాఁగలదు. అసలీ హ్రద నిర్మాణము త్వరలోఁ బూర్తికానిచో రాజమహేంద్రవరప్రాంతముల నదీగర్భమునఁ గ్రమాభివృద్ధియగుచున్న లంకలు, ఇసుక తిప్పలు డెల్టాసాగుబడికే ముప్పు తేగలవని యనుమానింపఁ బడుచున్నది.

ఈ హ్రదనిర్మాణము జరిగినచోఁ గుమారదేవపుఁ బొలములు కొన్ని మాగాణిభూములగుట కవకాశ మున్నది. ఆకాల మెప్పుడో యొకప్పుడు రాకపోదని వేచియున్న సమయములో విశ్వనాథుని పుణ్యమా యని రామయ్యగారి

పొలములలో నీటిజల పడి దాదాపు వేయి యెకరముల ఆయకట్టు గ్రామమునకేర్పడినది. అందఱును మహానంద మనుభవించిరి. ఇప్పు డాజలయు నాకస్మికముగా నాఁగిపోయెను. ఆ సమయమునకేఁ గేశవుఁడును, రాయలును గుమార దేవపు గోదావరి రేవులో నొక సల్లదొరగారితో సంభాషించుచుండిరి.

గోదావరిమీఁదుగా నిర్మింపఁబడిన దానికై రాజమహేంద్రవరమునుండి గోవూరునకు వంతెన కట్టుచున్న రోజు లవి. అచ్చటఁ బనిచేయుచున్న జనములకును, దక్కిన తెల్లవారికి మాంసము సద్దుబాటుచేయుటకై యాపల్లవార గోదావర ప్రాంతములలోఁ బశువులను గొని పొందగాఁ దోలుకొని వచ్చుచుఁ గుమార దేవపు రేవులో మకాము చేసినాఁడు. రాయలును, గేశవుఁడును నచ్చటికిఁ బరువెత్తిరి. గోమాంస భక్షణము పాపహేతువగును. తెల్లవారి తిండికై పవిత్రమగు గోవు నమ్మివేయుట యాత్మద్రోహము, దేశద్రోహము కూడ నగు ననియును రాయ లాదొరగారి కెఱిఁగించెను. అతఁడును [illegible] పూర్వులే గోమాంసమును దినియున్నారనియు, నందుచే నది తప్పుకాదనియును వాదించెను. చివరకు రాయలు తన వాదమ నిట్లు ముగించెను. —

"గోమాత సాత్త్విక రూపప్పుముద్ద. యుగయుగముల నుండియు తన సర్వస్వము మానవునికై యర్పించివేసినది. పూర్వులును గోమాంసమును దినియున్నా రనుట చేతకాని వాదము. ఏది తనకెక్కువ పవిత్రమో దానినాహుతి చేయుట

యజ్ఞ మగును. సర్వజ్ఞులైన మహర్షు లట్లొనర్చిరి. గో శ్రీకి మూలపీఠముగఁ గామధేనువును బెట్టుకొని వారు గోవును బరమ పవిత్రభావముతోఁ జూచిరి. మన కాపవిత్రభావము లేదు, ఆ సంస్కారమును లేదు. వారిలోనున్న సర్వగుణముల నెడ వైముఖ్యమును జూపి, మనకుఁగావలసిన యొక్క చోటను వారి నుదాహరించినంతమాత్రమున వాదనకు బలముచేకూరదు...

"తృప్తి తీరిన తరువాత మనము భుజింపము, ఇంతనీరు గోదావరిలో నున్నదని యంతనీరునుద్రాగము. మీకిష్టమున్న చో నిక్కడ మన ఋషుల నాదర్శముగాగ్రహింపుఁడు. మిగుల ముగ్గిచెట్టునుండి రాలిపడిన పండ్లనుమాత్ర మేతిని వారు బ్రతికిరి. అట్టిమాంసమును దినవలెనని యంతగా బాధయున్నచోఁ జని పోయినవానిని దినరాదా? అట్లు తినుట కిష్టములేనిచో బ్రతికి బలము సంపాదించుకొనుట కాహారపదార్థములు లేవా? ఇట్లంటివనని కూరగాయలను దినుటయు జీవహింసయే యని మీరందురేమో? అప్పుడింక నరమాంసమును దినుటయును దప్పు కాదని నేను వాదింతును. మీరొప్పుకొందురా?......

"తక్కిన జంతుజాలమంతటిలోను గోవు పరమసాధువు. అది మానవుని ప్రాణమిత్రము. ఈమూగజంతువులను గాపాడని నాఁడు మనకును, మనదేశమునకును ముక్తిలేదని మీ రెఱుంగవలయును..."

ఆనల్లదొరగారు సమాధానమును జెప్పలేక పోయినారు. రాయల వాదము నంగీకరించి తమ పశ్చాత్తాపమును దెలియ

పఱచిరి. ఆయన గోవులకై ఖర్చుపెట్టిన ధనమునంతటిని రాయలును కేశవుఁడును నింటికడనుండి తెప్పించి యిచ్చివేసి, గోవులను దమపాలములకుఁ దోలిపెట్టిరి. ఇట్టి ఉదారుల యామహోత్తర కార్యదీక్షను బరికించి కుమారి దేవతలు నాశ్చర్యపడిపోవుచున్నారు. విజయముతోఁ గేశవుఁడును రాయలును నింటికి వచ్చునప్పటికి నూతినుండి నీటి జల వచ్చుట యాగిపోయిన దని తెలిసెను. కేశవుఁడు కంగారుగాఁ బొలమువరకు గత్తెను. నీటిజల యాగిపోవుటకుఁ గారణ మూహింపలేక రాయలు మేడమీఁదికి వచ్చెను. నాఁ డుదయముననే యుద్యానవనములోనికి బోయిన విజయుఁడింతవఱకు నింటికి రాలేదని రజని చెప్పెను. రాయల కాశ్చర్యము మీఁద నాశ్చర్యమును, భయమును గూడఁ గలిగెను. ఆతఁడుద్యానవనములోనికిఁ బోయి వెదకినాఁడు. గోదావరి రొడ్డునెక్కి విజయుని గట్టిగాఁ బిలిచినాఁడు. జవాబు లేదు. వానికి నదరు కల్గినది. హతాశుఁడై చేయునదిలేక యింటికిఁ దిరిగి వచ్చెను. విచారముతోఁ బొలమునుండి వచ్చిన కేశవుఁడిది విని కొయ్యబారెను. రామశాస్త్రిగారికిని, ఈశ్వరమ్మగారికిని ఈవిషయము తెలిసినంతనే మొగములు వెలవెలఁబోయినవి. ఆరాత్రియు, మఱునాఁడును విజయునికొఱకై చుట్టుపట్టుల గ్రామములు, తోటలు, పొలములు నన్నింటిని గాలించివేసినారు. ఎక్కడను విజయునిజాడయైన తెలియలేదు. రామగిరికి, విజయేశ్వరమునకు, విశ్వనాథునొద్దకును గూడ కొందఱు వెళ్ళి వచ్చిరి. భారతీ భవానీ గిరిరావులును,

కుమారమోహన దంపతులును కుమారదేవమునకు వచ్చిరి. భవానీగిరిరావుగారు తమతోడ తామును వచ్చుటచే సంజనితయంతరం గములు నానంద శోక మొండొకటనుదయించి బుద్బుదములవలె దుఃఖ సముద్రమున నటుమాటున మున్నను. తనపై గోపగించి నప్పుడయ్యో నెటకేగి వెడలిపోయెనేమో యని రజని కుమిలిపోవుచున్నది. భవాని వదినెకు ధైర్యము చెప్పెను. ఆమె విజయుని జూడనే లేదు. "కారసాలకైన వచ్చితివి కాదే" యని బాధపడెను. ఆబాధతో నామె యున్న మొగమును జూడలేక పోయినది.

శాంతిదేవత యవతారమో యనన విశ్వనాథుఁడు బయలు దేరివచ్చి మాధవీమందిరమును బ్రవేశించెను. అందఱును లేచి నిలువఁబడిరి. ఆతఁ డందఱను స్తిమితముగఁ గూర్చుండనియమిం చెను. శిష్యులిరువురును గురుపాదములపైఁబడి తమ కుమారుఁ డగుపడునా యని దీనముగఁ బ్రార్థించిరి. — "పుత్త్రులారా! మనస్సు నచంచలముగఁజేసికొండు. దుఃఖములు మనకొక్కరికే వచ్చినవి కావు. విజ్ఞులైనవారు దుఃఖముల నధైర్యము చెందరు. మీపుత్త్రున కేమియు భయములేదు. వానికి నీటిగండమున్నది. అదిగడచి తప్పకబైటపడును. మరల విజయుఁడు మీకు నవ్య రూపముతోఁ గనఁబడును." అని విశ్వనాథుఁడు బోధించెను. నీటిగండముమాట వినినంతనే రాయబును, రజనియును ద్రుళ్ళి పడిరి. విజయుఁడు 'యమునా' లో మునిఁగిపోదునని చేసినసంజ్ఞ కిది యర్థము కాఁబోలు!

విజయుఁడు మరలఁ గంటఁబడునని విని యందఱు నమందానందమందిరి. అందును నవ్యరూపమును దాల్చునఁట!... ఇంతవఱకును భావ యనువానిని జూడనిభారతి విజయుఁడు తిరిగి వచ్చునని విని యుత్సాహముతోఁ జిందులు త్రొక్కినది. విశ్వనాథుఁడు భారతినిజూచి యాశ్చర్యపడెను. ఆమెను జేరఁ బిలిచి ముంగురులను వ్రేళ్ళతో దువ్వుచు "నీపేరేమి తల్లీ!" యని ప్రశ్నించెను. "భారతి" యని యామె చెప్పెను. విశ్వనాథుఁడును, రాయలు నొకేపరి భారతిని దేఱిపారఁ జూచినారు. భారతీయ సంస్కృతి యంతయుఁ దనలోఁ బ్రతిబింబించుచున్నట్లున్న భారతిని జూచి "అమ్మా! నీవు నిజముగ భారతివే! అందులకు సందేహము లేదు." అని రాయలు మనస్సులో ననుకొనెను. విశ్వనాథుఁడు భవానివైపు తిరిగి యిట్లు చెప్పినాఁడు— "అమ్మా! భారతి నీయొక్క తెభాగ్యమే కాదు. ఆమెను విశ్వభారతిఁగా గుర్తింపుము" — భవాని కన్నులలో నానందము వెల్లివిరిసినది. గిరిరావును సంతోషమున నానందబాష్పలోచనుఁడైనాఁడు.

"పుత్త్రులారా! విజయుఁడు కనఁబడునంతవఱకు నోపికతో నుండుఁడు. దుఃఖమును దరిఁజేరనీయవలదు. అమ్మా! రజనీ! నీవు రాయలయొద్ద శ్రద్ధతో సాహిత్యమును జదువుము. కుమారుఁ డంకమున లేని లోటును నీవు మఱచిపోఁగలవు" అని శిష్యులకు విశ్వనాథుఁడు తిరిగి యుపదేశించెను. ఈశ్వరమ్మగారును, రామయ్యగారు నీ పరిస్థితులకుఁ దట్టుకోలేకపోయిరి.

విశ్వనాథుఁడు వారిద్దరిని దన యాశ్రమమునఁ గొంతకాలము నివసింపఁగోరెను. వా రంగీకరించిరి. కుమారమోహన దంపతులు కుమార్తెకు ధైర్యము చెప్పి విశ్వనాథునితో వెడలి పోయిరి.

భవాని విజయమునకు రాయలు విని చాల నానందించెను. భారతి మేనమామలయొద్దకును, అత్తలయొద్దకును జాలఁ జనువుగా వచ్చినది. గిరిరావుబాబుకూడ బావగార్లతోఁ జాలఁ జనువుగా ప్రవర్తించినాఁడు. ఒక వారముగ్రోజులు గిరిరావు బాబు కుమారదేవమునందుండి భారతీ భవానులతో రామగిరి వెళ్ళిపోయెను. వెళ్ళుచు "వదినా! త్వరలో విజయుని తోడనున్న నిన్ను చూచుటకు వత్తును" అని భవాని రజనీకుమారితోఁ జెప్పెను. ఆనాఁడేయీశ్వరమ్మగారును, రామయ్యగారును విశ్వనాథాశ్రమమున కేఁగిరి.

కుమారదేవమున జబ్బులుప్రవేశించి గోతతిని హాతమార్చినవి. వరిచేలు చాలబాగుగా నాటిన వనుకొనుచున్న సమయములో నీటిజల వచ్చుట యాఁగిపోవుటచేఁ బంటంతయు మాఁడిపోయెను. దీనితో రైతులు హాహాకారము లొనర్చిరి. కొట్లలో నిలువయున్న ధాన్యమును గేశవుఁడు రైతులకుఁ బంచి నిట్టించెను. జబ్బులచే నావులు చనిపోయిన పేదరైతులకు రాయలు తాము నల్లదొరగారియొద్ద కొన్న యావులను సమముగాఁ బంచి వానిని వారివశము చేసినాఁడు. దీనితో రైతులందఱు నాయన్నదమ్ములకుఁ గృతజ్ఞులైరి.

మాగాణివ్యవసాయమున కిప్పుడు స్వస్తి చెప్పఁబడెను. కేశవ్రుడు తనపొలములలో నక్కడక్కడనూతులను త్రవ్వించి మోటలతో నీరుతోడించి యన్ని రకముల పంటలను బండించుటకుఁ బ్రయత్నములు చేయసాఁగెను. తక్కిన రైతులు నీపద్ధతి నే యవలంబించిరి. చంద్ర దీపికతో నుత్సాహముతో మరల గోసంరక్షణభారము వహించినది. కాని యామెకు విజయుఁడిప్పుడుకూడ లేకపోవుటచేఁ బూర్వమంత చురుకుదనము లేకపోయెను. గృహభారమంతయును జంద్రాకేశవులు వహించుటచే రజనికి రాయలకు నింటిపనులతో నిమిత్తము లేకపోయినది. రజనికుమారి దీక్షతో సాహిత్యమును జదువ మొదలిడెను. రాయలు వీణ నేర్చుకొందు నన్నాఁడు. రజని రాయలకు గురుత్వమును వహించినది. సాహిత్యములో రాయలు రజనికి గురువు.

విజయుఁడు గోదావరిలోఁ బడిపోవునప్పటికి రజనీకుమారి రెండునెలల గర్భవతి. ఇప్పు డైదవనెల దాఁటినది. ఒకనాఁటి సాయంకాలమున నిరువురును గంధపు దోఁపులోనికిఁ బోయిరి. తోఁపంతయు శిథిలావస్థలో నున్నది. పూర్వము తాము పేరులను జెక్కిన గంధపుజెట్టు మొదట త్రాఁచుయొక్క యస్థిపంజరము వారికిఁ గన్పించెను.— "రజనీ! మన ప్రేమ స్థిరముగా నుండుటకుఁ బూఁటకాఁపైన త్రాఁచు చనిపోయినది సుమా!" అని రాయలు హృదయభారముతో నన్నాఁడు. రజనికిఁ బూర్వము తానన్న మాటజ్ఞప్తికివచ్చెను—"ఈత్రాఁచుఁ చనిపోవు

టయు, మనవిజయుఁడు కనపడక పోవుటయు నొకేసమయ
మున జరిగియుండుననుకొందును.” అని రజని యనెను. రాయలు
తలయూపెను. అనుమానముతో వారు గంధపుప్రమాణమును
దడవినారు. ఎక్కడను దాము చెక్కిన పేరులు కన్పడలేదు.
ప్రమాణమందు బాగుగాఁ బెరిగిపోయి యుండుటచేఁ బై బెరడు
కలిసిపోయినది. ఆవిషయము వారి గుర్తునకు రాలేదు. ఇరువురి
మనములలో నేవియో చెప్పరాని భావములు ప్రవేశించినవి.
త్రాఁచుతోఁబాటు తనదైర్యమును నశించిపోదుకదా!... ..

నిశ్శబ్దముగ నిరువురు నింటికిఁ దిరిగి వచ్చిరి. ఆరాత్రి
వారికన్నము రుచింపలేదు. వెఱ్ఱిమొఱ్ఱి యాలోచనలతోఁ
బండుకొనిరి. ఉదయముననే రాయలు ప్రార్థన చేసెను. రాత్రి
నిద్రపట్టక యల్లిన పద్యము నొకదానిని రజని బిగ్గరగాఁజదివినది.
ఆచార్యుఁడగు రాయలు “రజనీ! అందుఁ దప్పులున్న” వనెను—
“లే” వన్నది రజని. ఆమెను దిరిగి చదువుమని రాయలు
తప్పులున్నస్థానములను జూపెను. ఆమె యొప్పుకొనలేదు.
“రజనీ! పూర్తిగా మేల్కాంచితివా?” యని రాయ లడిగెను.
రజని లేచి నిలుచున్నది — “ పూర్వ సంప్రదాయ బద్ధమైన
సనాతన కవిత్వము గిజగిజఁ దన్నుకొను యజ్ఞపశువు వంటిది.
గాలిపిల్లల వలెను, మొగిలుకన్నెల పగిదిని బర్వులిడు
స్వేచ్ఛాయుత నవ్య కవిత్వమును నేహార్షింతును” అని యామె
సమాధానమిచ్చెను. రాయ లిఁక మాట్లాడలేదు. వాదించినను
వినెడి యూహాలో నిప్పు డామె లేదు.

## 14

ఆనాఁడు గోదావరి ప్రవాహముతో సాఁగిపోయిన విజయుని గొందఱు పడవవాండ్రు రక్షించి యాతఁడు త్రాగిన నీటిని గ్రక్కించివేసిరి. మన్యపు సరకులను జవుకగాఁ గొని తెచ్చి గోదావరి వంతెన కట్టుచున్నవారి కమ్ముటకై పడవ వేసికొని వాడపల్లెనుండి పోలవరము పోవుచున్న యా పడవవాండ్రు తమతోఁగూడ విజయుని దీసికొనిపోయిరి. విజయుఁడు వారు పెట్టిన యేపదార్థమును ముట్టలేదు. అతఁ డేమి తినునో వారికిఁ దెలియలేదు. అట్లు రెండురోజులు విజయుఁ డుపవాసములు చేసెను. దానితో నాతఁడు బాగుగాఁ జిక్కిపోయినాఁడు. పోల వరము చేరిన తరువాత వారిలో నొకఁడు కొన్ని ఫలములను దెచ్చి విజయుని కిచ్చెను. సంతోషముతో విజయుఁ డాఫలము లను దినెను. అప్పటినుండియు వారు తిరిగి వచ్చువఱకు విజ యునికి ఫలములే యొసంగుచు నుండెడువారు. వాడపల్లె చేరిన తరువాత విజయు నేమి చేయవలెనో వారు నిశ్చయించుకోలేక పోయిరి. ఆబాలుఁడు కులీసునివలెఁ గన్పడుచున్నాఁడు. మాట లేదు. పిల్లలందఱివలె నన్ని పదార్థములను దినఁడు. యోగివలె నెప్పుడు నేదియో ధ్యానములో నుండును. ఒక విచిత్రవ్యక్తివలె నున్నాఁడీతఁ డని వా రనుకొనిరి.

ఒక నాల్గు నెలలు విజయుని దమకూడఁ ద్రిప్పుకొని వారు విసువుజెందిరి. ఈపరమయోగి మన కెందులకని వారొక

నాఁటి యుదయమున విజయుని గోదావరి గట్టుమీఁదకుఁ దీసి కొనివచ్చి విడిచివేసిరి. విజయుఁడు గోదావరి కెగువగా నడక మొదలుపెట్టి విశ్వనాథు నాశ్రమమునకు వచ్చెను. ఇఁక నాతఁడు నడువలేకపోయెను. కుటీరమును జూచి గట్టుదిగి వటవృక్షము కడకు వచ్చినాఁడు. ఎదురుగా ధ్యానములోనున్న విశ్వనాథుఁడు వానికంటఁ బడెను. వానిని జూడఁగనే యేలొకో విజయుఁడు నిలువెల్ల వణఁకిపోయి కెవ్వునఁ గేకవేసినాఁడు. ఆ కేకతో విజయుని గొంతుముడి విడివడి వానికి మాటలు వచ్చెను. విజయుని జీవితములోఁ గ్రొత్తదశ ప్రారంభమైనది.

విశ్వనాథుఁడు ధ్యానము ముగించి కనులు తెఱచి యెదురుగానున్న విజయునిపైఁ జల్లనిచూపులఁ బ్రసరింపఁజేసినాఁడు. విజయునిలో నపూర్వమగు చలనము కలిగెను.

గురుర్బ్రహ్మ గురుర్విష్ణు ర్గురు దేవో మహేశ్వరః
గురుస్సాక్షా త్పరబ్రహ్మ తస్మై శ్రీగురవేనమః॥
అజ్ఞాన తిమిరాంధస్య జ్ఞానాంజన శలాకయా
చక్షు రున్మీలితమ్ యేన తస్మై శ్రీగురవేనమః॥

అని ప్రతినిత్యమును దండ్రిచదువగాఁ దనకూహవచ్చినప్పటినుండియు వినియున్న శ్లోకములనుబఠించి విజయుఁడు విశ్వనాథుని యెదుట సాష్టాంగపడినాఁడు. విశ్వనాథుఁడు ప్రేమతో "సకలశాస్త్ర విశారదుఁడవు కమ్ము" అని దీవించుచు వానిని లేవనెత్తెను. విశ్వనాథుఁడు విజయుని గుర్తించినాఁడు. వాని యానందమున కంతు లేకపోయెను. అతఁ డీశ్వరమ్మగారిని

రామయ్యగారిని బిలిచెను. విజయుడు తాతగారిని, నాయన నమ్మను గుర్తించి వినయముతో నమస్కరించెను. అపూర్వాంతముగా మనుమని నెత్తుకొని వారిరువు రానందబాష్పములతో వాని శిరమును తడిసిచేసిరి.

ఆ మువ్వుర నాశ్రమమునందే యుండ నియమించి విశ్వనాథుడానాడే బయలుదేరి కుమార దేవమునకు వచ్చెను. ఆచార్యునాకస్మికాగమనమునకు విస్మయ మొందుచు శిష్యులిరువురును గురుపాదములకు ప్రణామములర్పించుకొనిపోయిరి. వారి మొగములపై వర్ణ్యమును గాంచి విశ్వనాథుడు కారణమడిగెను. రజని సమాధానమునంగ సిగ్గిలెను. రాయలు ప్రత్యేకము, గంధపు ప్రమిదల వృత్తాంతమును, తమ భేదాభిప్రాయములను దాపక గురునికి నివేదించినాడు. అంత విశ్వనాథుడు శిష్యుల నిరువురను దోడ్కొని గంధపుచెట్టు కడ కేగెను. రాయల యొద్ద నున్న చాకుతో విశ్వనాథుడు చెట్టుబెరడు నూడదీసెను. వ్రాతలో గలిపిన వ్రాత కనుపించినది. ఆతురతతో రాయలు పైనున్న రజనీకుమారి పేరు చదివెను. రజనీకుమారి రాయల పేరు చదివినది. ఇరువురు నొండొరులం జూచుకొనిరి. విశ్వనాథుడు మందహాస మొనర్చి యిట్లు బోధించినాడు.

"అమ్మాయీ! నీవు సంగీతమున నిధివి. సాహిత్యము దానికి వన్నె పెట్టునదియు, దానం గుమారుడు వెంట లేడను విచారమును పోగొట్టునదియు నేను నిన్ను సాహిత్యమును జదువుమంటిని. రాయలు సాహిత్యాచార్యుడు..."—రాయల

కనులు విం...తో మొఱపెసిన వి— "...శిష్యులను నేను బ్రశం సింపరాదు. కాని ... మాటచే బ్రస్తావింపక తప్పినది కాదు. రాయలు ... సందుకొండనంటి వాడు. తీక్ష్ణముగ నాలో చించినచో ...కే తెలియగలదు. నీమార్గము ...ది. వాని పథము ...ది. ఒకరి నింకొకరు నిమన్నించుకొనుటకధికారము లేదు." — రజని చూపుల... క్షమాపణ వేడుకొన్నది. రాయలు నవ్విరి. మఱునాటికి ...మగిరినుండి యామువ్వురు నా శ్రమమునకు వచ్చి చేర్పాట్లు కావించినారు. మీారు నల్గురు రేపకడనే బయలుదేరి యచ్చటికి రండనియు విశ్వ నాథుఁడు రాయలతోఁ జెప్పి వెడలిపోయెను. ఏమో ... దని వారనుకొనిరి. రామగిరికి వెంటనే కేశవుఁడు కబురుచేసెను.

ఉదయమున రజనీ రాయలును, జంద్రా కేశవులును విశ్వనాథు నాశ్రమమునకు వచ్చిరి. విజయుఁడు వారికెదురుగా వచ్చి తల్లిదండ్రులకు నమస్కరించెను. తల్లిదండ్రులిరువురును నానందాశ్చర్యములతోఁ గుమారు నొక్కమారే యెత్తుకొనిరి. చంద్రా కేశవు లిరువురు నచేతనులభంగి నిల్చి పరికింపసాగిరి— "అమ్మా! ఇంతవఱకును మూఁగవాఁడనై మీాహృదయము లకుఁ గష్టము కల్గించితిని, క్షమింపవలయును." అని విజ యుఁడు వినమ్రుఁడై నాఁడు. ఆ నల్గురును మొదట నేయాకాశ వాణియో పలుకుచున్నదనుకొనిరి. కాని విజయుఁడే మాట్లాడు చున్నాఁడని వారు గ్రహించినారు. విజయునికి మాటలుకూడ వచ్చినవే!..." మరల విజయుఁడు మీాకు నవ్వరూపములోఁ

గన్పడు" నని విశ్వనాథులు చెప్పినమాట కిదే యర్థము కాఁబోలు....."

తాను గర్భవతి నన్నమాట మఱచిపోయి కుమారుని జంకకు నెత్తికొని రజనీకుమారి ముద్దులతో నింపివేసెను. బావగా రున్నా రన్నమాటయే మఱచిపోయి చంద్ర తోడి కోడలి చంకనుండి విజయుని లాఁగికొని "కన్నయ్యా!" యనుచు నుప్పొంగిపోయెను. కేశవుఁడును రాయలు నానంద స్వాంతులై యట్టె నిలిచిపోయిరి. రామగిరినుండి భారతీ భవానీ గిరిరావులును, విజయేశ్వరమునుండి కుమారమోహన దంపతులును జాము ప్రొద్దెక్కునప్పటి కాశ్రమమునకు వచ్చిరి. మరల నామూఁడు కుటుంబములు నొక్కసారిగా హర్షాక్రాంత మైనవి. విశ్వనాథుఁడు యోగాభ్యాసమును ముగించివచ్చెను. వినయముతోఁ గృతజ్ఞతతో నందఱును లేచి నిలబడిరి. వారిని గూర్చుండ నియమించి విశ్వనాథుఁ డిరువురు జమీందారుల మొగమై యిట్లు చెప్పెను:

"మీ కుటుంబము లన్నియు నొడుదుడుకులను దాఁటి బైటఁబడినవి. ఇఁక మీరు సుఖముగా నుండగలరు. కాని దేశ మంతయును దప్పుత్రోవలఁబడి నిర్వీర్యమైపోవుచున్నది. ఒక దేశము దాస్యబద్ధమగుటకుఁ గారణ మింకొకరి ప్రాబల్యము కాదు. ఆజాతి నిస్తేజమగుటయే ముఖ్యకారణము. ఏదేశమేని సంపన్నతఁ గొందుట యనునది యాజాతిసంస్కృతిపై నాధారపడి యుండును. అట్టి సంస్కృతి మన కిప్పుడున్న విద్యావిధానము

వలన రాదు. కావున మీ యైశ్వర్యము నంతటిని వినియోగించి యీ యాశ్రమమునే కేంద్రముగఁ జేసి దుర్గతిని బడిపోవుచున్న దేశమునకు, విశ్వమునకుఁ గూడ సత్పథమును బోధింపఁగలుగు నొక గురుకులమును స్థాపింపుఁడు.........

"శ్రీమహా గురుపాదులు నాకుఁ బ్రసాదించిన విద్యనంతటిని నేనిదివఱకే శిష్యులకుఁ బంచియిచ్చి వేసితిని. వీరిరువురును గురుకులాభ్యున్నతికై తమ జీవితములను ధారవోయుదురు. రాయలు గురుకుల ప్రధానాచార్యపదవిని నిర్వహించును. మన విజయుఁడును, భారతియు నీగురుకులమున మొట్టమొదటి శిష్యులుగా గ్రహింపఁబడుదురు. ఈ గురుకులము 'విశ్వభారతి' యై విశ్వమునకు మార్గదర్శక మగునుగాక!"— జమీందారులు భారమును శిరసావహించిరి. రజనియు రాయలు నుత్సాహమును జూపిరి. విజయుఁడును, భారతియు నొండొరులను జూచుకొనిరి. ఇరువురకు నదియే ప్రథమపరిచయము.

గురుకులమునకుఁ గావలసిన క్రొత్త కట్టడములను ద్వరలోఁ బూర్తి కావించిరి. కట్టడపునిర్మాణములు జరుగుచుండఁగా, రజనీకుమారి పుత్రుని గనెను. తల్లిదండ్రుల యనుమతిమీఁదను విశ్వనాథు ననుజ్ఞతోడను రాయ లా బాలుని విజయేశ్వరాధీశులకు దత్తతగా నొసంగెను. వేసఁగి దాఁటగనే విశ్వనాథుఁడు స్వయముగా గురుకులమునకుఁ బ్రారంభోత్సవమును గావించెను. "విశ్వభారతి" తన కార్యక్రమమును

ప్రారంభించినది. సిద్ధసంకేతలు ... విశ్వభారతి ... నలుదెసలు వెడలిపోయెను.

విశ్వభారతీ గురుకులమునకు వివిధ దేశములనుండి కుశలగు నధ్యాపకులు రావింపబడిరి. దేశ ... నుండియు విద్యార్థులు గురుకులమునకు ... అన్ని విషయములలోను విద్య గఱపబడుచుండెను. శిక్షాకాలమంత యును విద్యార్థులు గురుకులమునందే నివసింపవలెను. అధ్యా పకులు నందే యుందురు. విద్యార్థులకు నధ్యాపకులకు నిరం తర సంబంధము స్థిరపడి యుండవలెనని యుండెలి ... కాటు. సర్వమానవసౌభ్రాత్రమునకు, విశ్వశాంతికిని అది పుట్టినిల్లు. అందు జాతి, మత విభేదములు నాస్తి. గురుకులమే భార మును వహించి విద్యార్థులను దేశాటనము చేయించును. శిక్షాకాలము పూర్తియగునప్పటికి నొక్కొక్కరు తమ తమ యభిమాన విద్యలందు ప్రవీణు లగుదురు. ఆసక్తి, శక్తి యున్నచో నింకను బరిశ్రమచేయుటకు వీళ్ళున్నవి. సమస్త దేశాధిపతులును ' విశ్వభారతి ' ని గౌరవించి తమతమ సాహా య్యములను ప్రకటించిరి. గురుకులము ప్రపంచమునకు కేంద్ర స్థానమై యొప్పుచుండెను. ఆ గురుకులశ్రీకి గోదావరినది పాదాయలు వన్నెలు దిద్దుచున్నది.

సంవత్సర మొకటిగడిచెను. భవాని మొగశిశువును జంద్ర మూడశిశువును గనిరి. ఆ శిశువు లిరువురకును రామయ్యగారి

పేరును, విశ్వభారతి పేరును బెట్టినారు. తా మీ సృష్టిని విద్యాలయమునకు పెట్టిన పేరు సార్థకము! ఎంత యున్నతాదర్శము!...

విశ్వభారతి ప్రథమ వార్షికోత్సవమునాడు కులపతియైన రాయలు తెలుగు సాహిత్యమునందలి లను, దాని గొప్పతనము, ఆ సాహిత్యమును పెంచిన మహానుభావుల ఔన్నత్యమును గూర్చి యనర్గళముగ నుపన్యసించెను. అప్పుడే తీసి 'వడబోసి పెట్టిన యిక్షురసము' వలె రాయల యుపన్యాసము నడచినది. తరువాత సంగీతాధ్యాపకురాలగు రజనీకుమారి వీణపై మృదులగానామృతమును వర్షింపజేసెను. ఆ భార్యాభర్తలను జూచి యాంధ్ర దేశము పొంగినది. భరతవర్షము గర్వపడినది. విదేశములు తలలూపినవి. మఱునా డెక్కడ చూచినను వారి ప్రశంసయే. నాటిరాత్రి మరల రాయలన్నాడు—"రజనీ! నీవు సంగీతకళాధిదేవతవు."—అని.

రజని సమాధాన మిచ్చినది — నాథా! మీరలు మహాకవులు, నేనెంతదానను!......" — అని.

రజని సమాధానమునకు రాయలు మందహాసము చేసినాడు.

---

ప్రారంభించినది. సిద్ధసంకల్పుడగు విశ్వనాథుని యొక్క ఆశయ ఫలములై వెడలిపోయెను.

విశ్వభారతీ గురుకులమునకు వివిధ దేశములనుండి ఘనులగు నధ్యాపకులు రావింపబడిరి. దేశవిదేశముల నుండియు విద్యార్థులు గురుకులమునకు రాజొచ్చిరి. అన్ని విషయములలోను విద్య గఱపబడుచుండెను. శిక్షాకాలమంతయును విద్యార్థులు గురుకులమునందే నివసింపవలెను. అధ్యాపకులు నందే యుందురు. విద్యార్థులకు నధ్యాపకులకు నిరంతర సంబంధము స్థిరపడి యుండవలెనని యుండెడి ఏర్పాటు. సర్వమానవసౌభ్రాత్రమునకు, విశ్వశాంతికిని అది పుట్టినిల్లు. అందు జాతి, మత విభేదములు నాస్తి. గురుకులమే భారమును వహించి విద్యార్థులను దేశాటనము చేయించును. శిక్షాకాలము పూర్తియగునప్పటికి నొక్కొక్కరు తమ తమ యభిమాన విద్యలందు ప్రవీణు లగుదురు. ఆసక్తి, శక్తి యున్నచో నింకను బరిశ్రమచేయుటకు వీళ్ళున్నవి. సమస్త దేశాధిపతులును 'విశ్వభారతి' ని గౌరవించి తమతమ సాహాయ్యములను బ్రకటించిరి. గురుకులము ప్రపంచమునకు కేంద్ర స్థానమై యొప్పుచుండెను. ఆ గురుకులశ్రీకి గోదావరినది హొయలు వన్నెలు దిద్దుచున్నది.

సంవత్సర మొకటిగడిచెను. భవాని మొగశిశువును జంద్ర యాడశిశువును గనిరి. ఆ శిశువు లిరువురకును రామయ్యగారి

పేరున, ఈశ్వరమ్మగారి పేరును పెట్టినారు. తా మిఁక వృద్ధను విద్యాసంస్థ వలెనున్న యీర్ష్యమాదృశో ? మిటీ కున్న జేవా?...

విశ్వభారతి సదస్యుల ప్రథమ వార్షికోత్సవమునాఁడు కులపతియైన రాయలు తెలుఁగు సాహిత్యములోని సందేశములను, దాని గొప్పతనమును, ఆసాహిత్యమును రచించి పెంచిన మహానుభావుల యోగ్యతామును, వారి యనర్గళముగ నుపన్యసించెను. అప్పుడే తీసి 'వడపోసి పెట్టిన యిక్షురసము' వలె రాయల యుపన్యాసము నడచినది. తరువాత సంగీతాధ్యాపకురాలగు రజనీకుమారి వీణపై మృదులగానామృతమును వర్షింపఁ జేసెను. ఆ భార్యాభర్తలనుజూచి యాంధ్రదేశ ముప్పొంగినది. భరతవర్షము గర్వపడినది. విదేశములు తలలూపినవి. మఱునాఁ డెక్కడ చూచినను వారి ప్రశంసయే. నాఁటిరాత్రి మరల రాయలన్నాఁడు—"రజనీ! నీవు సంగీతకళాధిదేవతవు."—అని.

రజని సమాధాన మిచ్చినది — "నాథా! మీరలు మహాకవులు, నే నెంతదానను!.....” — అని.

రజని సమాధానమునకు రాయలు మందహాసము చేసినాఁడు.

---

సరస్వతీ పవర్ ప్రెస్, రాజమండ్రి

ప్రారంభించినది. సిద్ధసంకల్పుడగు విశ్వనాథుని హృదయాలయ [illegible] వెడలిపోయెను.

విశ్వభారతీ గురుకులమునకు వివిధ దేశములనుండి ఘనులగు నధ్యాపకులు రావింపబడిరి. దేశ దేశాంతరముల నుండియు విద్యార్థులు గురుకులమునకు రాదొడగిరి. అన్ని విషయములలోను విద్య గఱుపబడుచుండెను. శిక్షాకాలమంత యును విద్యార్థులు గురుకులమునందే నివసింపవలెను. అధ్యాపకులు నందే యుందురు. విద్యార్థులకు నధ్యాపకులకు నిరంతర సంబంధము స్థిరపడి యుండవలెనని యుండెడి కట్టుబాటు. సర్వమానవసౌభ్రాత్రమునకు, విశ్వశాంతికిని అది పుట్టినిల్లు. అందు జాతి, మత విభేదములు నాస్తి. గురుకులమే భారమును వహించి విద్యార్థులను దేశాటనము చేయించును. శిక్షాకాలము పూర్తియగునప్పటికి నొక్కొక్కరు తమ తమ యభిమాన విద్యలందు ప్రవీణు లగుదురు. ఆసక్తి, శక్తి యున్నచో నింకను బరిశ్రమచేయుటకు వీళ్ళున్నవి. సమస్త దేశాధిపతులును ' విశ్వభారతి ' ని గౌరవించి తమతమ సాహాయ్యములను ప్రకటించిరి. గురుకులము ప్రపంచమునకు కేంద్ర స్థానమై యొప్పుచుండెను. ఆ గురుకులశ్రీకి గోదావరినది హారాయులు వన్నెలు దిద్దుచున్నది.

సంవత్సర మొకటిగడిచెను. భవాని మొగశిశువును ఇంద్ర యాడశిశువును గనిరి. ఆ శిశువు లిరువురకును రామయ్యగారి

పేరును, కళ్యాణమ్మగారి పేరును బెట్టినారు. తాను సంపాదించిన విద్యాసంస్థకు వశిష్ఠా ఏమర్థమున్నదో! ఇది కూడ దేవా!...

విశ్వభారతి గురుకుల ప్రథమ వార్షికోత్సవమునాఁడు కులపతియైన రాయలు తెలుగు సాహిత్యమునందలి ప్రబంధములను, వాని గొప్పతనమును, ఆసాహిత్యమును ప్రోత్సహించి పెంచిన మహానుభావుల ఔదార్యమును గూర్చి యనర్గళముగ నుపన్యసించెను. అప్పుడే తీసి 'వడపోత పెట్టిన యిక్షురసము' వలె రాయల యుపన్యాసము నడచినది. తరువాత సంగీతాధ్యాపకురాలగు రజనీకుమారి వీణపై మృదులగానామృతమును వర్షింపఁ జేసెను. ఆ భార్యాభర్తలనుజూచి యాంధ్ర దేశము పొంగినది. భరతవర్షము గర్వపడినది. విదేశములు తలలూపినవి. మఱునాఁ డెక్కడ చూచినను వారి ప్రశంసయే. నాఁటిరాత్రి మరల రాయలన్నాఁడు—"రజనీ! నీవు సంగీతకళాధిదేవతవు."—అని.

రజని సమాధాన మిచ్చినది — నాథా! మీరలు మహాకవులు, నేనెంతదానను!......" — అని.

రజని సమాధానమునకు రాయలు మందహాసము చేసినాఁడు.

---

సరస్వతీ పవర్ ప్రెస్, రాజమండ్రి

## అ భి ప్రా యా ము లు

చి॥ పోణంగి శ్రీరామ అప్పారావు రచించిన 'విశ్వభారతి' అను నవలను నే నామూలాగ్రముగాఁ జదివితిని.

వచన రచన కృతకముగాఁ గాక లోకసహజముగా నున్నది. పాత్ర పోషణయుఁ గల్పనయు మిక్కిలి రమ్యములుగా నున్నవి. ఆదర్శమైనవిద్య యెట్లుండునో, ఆ గురువు లెట్లుండవలెనో అది యంతయు చక్కగా నిర్మింపఁబడినది. కథ క్రొత్తది. కవియొక్క భాషాభిమానము దేశభక్తి మొదలయినవి యీ గ్రంథమునందు సువ్యక్తముగా నున్నవి. తెలుఁగున నవల లిట్లు స్వతంత్రభావరమ్యములైనవి వెలయవలయును. ఇతఁడు భవిష్యత్తున నింక ననేకములు వ్రాసి తెలుఁగుభాషాయోషకు సేవ సేయుఁగాక.

బెజవాడ }
3–10–46 } విశ్వనాథ సత్యనారాయణ

* * *

ఓమ్.

ప్రతికవి ఏదో మహాశయమును నిర్మించుకొని, తదాశయమును తన రచనలో ప్రతిబింబించుకొని ఆనందము పొందుచుండును. జీవితములో ఆయాశయము స్వప్నమాత్రమే. అందులకే కవులు సాధారణముగా స్వప్నవాదు లవుచుందురు. ఎంతటి మహోన్నతాశయమైనను దాని కాధారము జీవితమే. ఆ యాశయ సాధనకై ప్రయాణించినచో వెల్గునీడల మధ్యనున్న యీదారిలో కవి తన యాశయములోని కొలది యనుభవమునైనను పొందగలుగును.

శ్రీరామ అప్పారావుగారికి ఉత్తమమైన గ్రామజీవితము చాల నిష్టము. గ్రామజీవిత మఖండ విద్యాబలయుక్తమై యుండవలయుననియు, భారత సౌభాగ్య మంతయు నీయుగములో నగర గ్రామాల యుత్తమ సమన్వయములో నిమిడియున్న దనియు నాయన వాదన. గ్రామజీవితమే భారతీయ సంస్కృతి సంపూర్ణముగా వికసించగల యుత్తమోద్యాన మని ఆయన యీ నవలలో అనుమానరహితముగా ప్రవచించినాఁడు.

ఈ యితివృత్తమును అప్పారావుగారు మధురమైన శైలిలో అనర్ఘమైన గోదావరినదకవంటి ధారలో మూర్తీభవింపఁజేసినారు. ఆంధ్ర దేశములోని ఉత్తమనవలలో నిది యొకటి.

(Camp) భీమవరం }
12—11—46 } అడవి బాపిరాజు

VISWA BHARATHI    *By P. S. R. Appa Rao.*

శ్రీ పోణంగి శ్రీరామ అప్పారావు గారి రచనలు



జననము 21-7-1923.    బందపురం, ప. గో. జి.

| | | |
|---|---|---|
| తాజ్‌మహల్ | ... | నాటిక. |
| విశ్వభారతి | ... | నవల. |
| వేణువు | .... | పద్యాత్మకమైనగద్యము |

నాట్యశాస్త్రము ... భరతముని ప్రణీతమైన నాట్యశాస్త్రమునకు సమగ్రమును, సరళమును, సవిమర్శకమును, సచిత్రమును అగు తెలుగుసేత.

పేజీలు 1000.    మూల్యం రు. 20.

Published By:

ARUNASRI GRANDHAMALA, SECUNDERABAD.